# భారతీయ

# జానపద నృత్యాలు

ఒకటవ భాగం


రచయితలు:

శ్రీమతి కపిలా వాత్స్యాయన్

శ్రీ సచ్చిదానంద వాత్స్యాయన్


అనువాదం:

ఊట్ల కొండయ్య




హంస పబ్లికేషన్స్, విజయవాడ-2

# Folk Dances of India

## PART - I

*By*

KAPILA VATSYAYAN

*AND*

SACHCHIDANANDA VATSYAYAN

Telugu Translation by :

UTLA KONDAYYA

**ACKNOWLEDGMENTS**

The photographs in this booklet, other than those taken by the authors themselves, have been obtained through the courtesy of the Press Information Bureau, Government of India, and from the Information and Publicity Departments of the various State Governments concerned. The authors acknowledge their indebtedness to these agencies.

First Edition: January 1960.
Copies 5000, Price Rs. 2. 40



PUBLISHED UNDER THE AUSPICES OF THE SOUTHERN LANGUAGES BOOK TRUST, MADRAS.
TELUGU-45

PUBLISHED IN TELUGU BY :
HAMSA PUBLICATIONS,
VIJAYAWADA-2.

# పరిచయము

ప్రజాసామాన్యానికి ఆకర్షణీయంగా, విశేషోపయోగకరంగా ఉండే పుస్తకాల ప్రచురణకు దోహదం చెయ్యాలనే సంకల్పంతో దక్షిణ భారత పుస్తకసంస్థ లోగడ కొన్ని పుస్తకాలను ప్రచురింపజేసింది. ఆ ప్రచురణలవలన కలిగిన అనుభవంతో ఇప్పుడు మరికొన్ని పుస్తకాలను వివిధ ద్రావిడ భాషలలోకి అనువాదం చేయించి ప్రచురింపజేస్తూంది. పాఠకులలో భిన్న భిన్న అభిరుచులకు తగినట్టు ఈ పుస్తకాలను శ్రద్ధగా ఎన్నిక చేశారు. అందువల్ల మానవ జీవితానికి సంబంధించిన వివిధ విషయాలను గురించిన రచనలు ఇందులో ఉండటం సహజం. భారత మహానాయకుల జీవిత చరిత్రలు, వారు చేసిన ఘనకార్యాలు వివరించే గ్రంథాలు ఈ ద్వితీయ గ్రంథ పరంపరలో ఒక శాఖ. మన దేశ శ్రేయస్సుకోసం, అభ్యుదయంకోసం ఆ మహాపురుషులు ఏమి చేసినది, వారికి తామెంత ఋణపడి ఉన్నది, ప్రజలకు ముఖ్యావశ్యకములైన హక్కులను సంపాదించటానికి వా రెన్ని పాట్లు పడినదీ ముందు తరాలవారంతా తెలుసుకుని ఉండటం మంచిది.

తత్త్వశాస్త్రం, మతం, విజ్ఞానశాస్త్రం, సాహిత్యం— ఈ గ్రంథ పరంపరలోని ఇతర శాఖలు, కథానికలు, ప్రాచీన కళా సంపదలను అభివర్ణించే గ్రంథాలుకూడా ఇందులో ఉండటం ముదావహం. నాటకకళ, శిల్పశాస్త్రం, పురావస్తు పరిశోధనలు,

నిరతాద్భుతావహములైన దాక్షిణాత్య దేవాలయాలను గురించిన గ్రంథాలు ఈ పరంపరలో ఉన్నవి. విజ్ఞాన వికాసదాయకములైన భిన్న భిన్న విషయాలను గురించిన ఈ గ్రంథాలు ప్రజలను విశేషంగా ఆకర్షించగలవు. ఆ విధంగా ఇట్టి ప్రచురణలకు ముందు విస్తార ప్రచారం కలుగ గలదని నా విశ్వాసం.

దక్షిణ భారత భాషలలోని ఉత్తమ గ్రంథాలు కొన్నింటిని మిగిలిన దాక్షిణాత్య భాషలలోకి అనువదింపచేయటం ఈ ద్వితీయ గ్రంథ పరంపరలోని మరొక ప్రశంసనీయమైన విశేషం. ఈ పుస్తకాలన్నీ పూర్తిగా వెలువడినప్పుడు, విద్యావంతులలో ఎక్కువ మందిని వివిధ విషయాలను గురించిన జ్ఞానాసక్తిగల పాఠకులనుగా ఆకర్షించి, ఆ జ్ఞానపిపాసను తృప్తి పరచటానికి యోగ్యమైన గ్రంథాలనుకూడా వారికి అందజేసినట్టు అవుతుంది.

ఈ దక్షిణ భాషా పుస్తకసంస్థ ఆశయాలు శీఘ్రగతిని సఫలం కాగలవని ఆశిస్తున్నాను.

మద్రాసు, 7-10-1958

ఇట్లు,
డా॥ ఎ. లక్ష్మణస్వామి మొదలియార్,
వైస్ ఛాన్సెలర్,
మద్రాసు విశ్వవిద్యాలయం.

# ముందు మాట

భారత దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత అనేక రంగాలలో భారతదేశం అభివృద్ధి చెందినది. జానపద కళల పునరుద్ధరణమే కాక, ముఖ్యంగా జాతి యొక్క సాంస్కృతిక, సామాజిక జీవితంలో జానపద నృత్యానికిగల ప్రాముఖ్యాన్ని గమనించి, జానపద నృత్యాన్ని పునరుద్ధరించడము, ప్రోత్సహించడము, స్వతంత్ర భారతంలోని అభివృద్ధి కార్యక్రమాలలో ఎంతో ప్రధానమైనది. ప్రజల మధ్యనే పుట్టి పెరిగే నృత్యము, సంగీతము, చిత్రలేఖనము మొదలైన జానపద కళలకు స్వతస్సిద్ధంగాఉండే విలువమాట అలాఉంచి, పరిణతి చెందిన కళాస్వరూపాలకు, ఆకళల తొలిరూపాలకు గల సంబంధాన్ని వ్యక్తపరచ గలవి ఈ జానపద కళలు మాత్రమే. అందుచేత, అవిచ్ఛిన్నమైన జీవనగతి పాత కొత్తల మధ్య ఏర్పరిచే అఖాతాన్ని దాటించగల వంతెన లాంటివి జానపద కళలు.

శాస్త్రీయ కళలలో కంటె, జానపద కళలలో ప్రజాజీవితము, ప్రజల జీవితంలోని కష్టసుఖాలు, ఎత్తు పల్లాలు, సుఖదుఃఖాలు, ఎక్కువగా ప్రతిబింబిస్తాయి. అంతేకాదు; ఎక్కువ స్వచ్ఛంగా కూడా ప్రజాజీవితాన్ని

మనం జానపద కళలలో చూడ గలుగుతాము. జానపద కళలను అవగతం చేసుకొనడ మంటే, ఈ జానపద కళలలో అంతర్నిహితమై ఉన్న ఆదిమ తత్వాన్ని మనం దర్శించడ మన్నమాట. రాజకీయంగాను, సాంఘికం గాను, దేశంలో ఎన్నో మార్పులు జరిగినప్పటికి, ఈ మార్పులకు చెదరక శతాబ్దాలనుంచి నిలిచిన ఆ ఆదిమ తత్వాన్ని మనం జానపద కళలలో దర్శించి ఆ తత్వానికి జోహారు లర్పించ గలము. ఈ జానపద కళలలోని అంతశ్శక్తినీ, దృఢతనూ ఈ ఆదిమ తత్వం రుజువు పరుస్తుంది. ఈ జానపద కళాస్వరూపాలు, ఈ స్వరూపా లను సృష్టించిన ప్రజల స్వచ్ఛంద భావోద్వేగాల దాపుకు మనల్ని తీసుకుని వెడతాయి.

ప్రజల భావోద్వేగం సహజంగా పొంగి పొరలడం వలన ఏర్పడినవే జానపద నృత్య సంగీతాలు. వారి నిత్య జీవితంలోని బాధ్యతలూ కర్మ కలాపాలూ కృషిజనిత మైన ఆనందమూ ఈ కళలలో ప్రతిబింబిస్తుంది. నిత్య జీవితంలోని మామూలు కార్యభారాలనే వారు కవితగా, గీతిగా, గానంగా, వర్ణంగా పరివర్తితం కావించారు. అతిసామాన్యమైన ఉద్వేగం కూడా జానపద కళలలో ఎంతో ఉజ్వల రూపంలో అగుపిస్తుంది.

నిత్యజీవిత శృంఖలా బద్ధమైన మానవాత్మను విముక్తంచేసి అనంత తారాపథానికి ఎగిరేట్లు చెయ్య గలవి జానపద కళలు. జోలపాట కావచ్చు, పంటకోతల పాట కావచ్చు, రోడ్డురోలరు లాగేవారిపాట కావచ్చు,

పెండ్లి కుమార్తె సింగారింపు పాట కావచ్చు, అంపకాల పాటకావచ్చు, జననమరణాలకు వివిధ భావవిభ్రమాలను, పండుగ ఉత్సాహాతిరేకాన్ని ప్రతిఫలించే పాటలు కావచ్చు, ఈజానపద గీతాలను ప్రజల వివిధ భావవిభ్రమ గతులను స్వచ్ఛ స్వచ్ఛంద ధోరణిలో ప్రతిఫలించి వ్యక్తీకరిస్తాయి. ఈ జానపద గీతాలలోని ధారాశుద్ధి స్వచ్ఛమైనది. ఎరువు తెచ్చుకున్నది కాదు. కృత్రిమాలంకార భూషితమైనదీ కాదు. అందుచేతనే జానపద నృత్యగీత రీతులు ప్రజా జీవితాన్ని ఇంత ఉజ్వలంగా ప్రతిఫలించ గలుగుతున్నవి. ఈ నృత్యరీతులు ప్రాచీన చారిత్రక సంప్రదాయాలలోనే ప్రేళ్ళు పాతుకుని ఉన్నవి.

ప్రాకృతిక, వాతావరణ, ఆచార, వ్యవహారాది కాలలో దేశంలో వ్యత్యాసాలు ఉన్నందున, వివిధ రీతులలో నృత్యగానాలు వెల్లివిరిసినవి. రీతులలో వ్యత్యాసాలు ఉన్నప్పటికి, మత సంప్రదాయాలలో ఉన్న ఏకానుబంధంవల్ల ఈ వివిధరీతులలోను అంతర్నిహితంగా ఒక ఐక్యభావం ఉన్నది.

సమ్యగ్దృష్టితో ఈ జానపద కళారూపాలను అవగతం చేసుకోవలసిన అవసరం ఉన్నది. జానపద కళారీతుల స్వరూపాన్ని అవగతం చేసుకొన్నట్లయితే, భారతదేశ సాంస్కృతిక భవిష్యత్తును దృఢతరమైన పునాదులపై నిర్మించుటకు ఎంతైనా ప్రోత్సాహకారి కాగలదు.

దక్షిణ భాషా పుస్తక సంస్థ ఈ అమూల్య మూల్యాన్ని నాలుగు ప్రధాన దక్షిణాది భాషలలో దక్షిణాది పాఠకులకు అందచేయడం మిక్కిలి సంతోషింప దగిన విషయం. కళా సాహిత్య రంగాలలో పేరెన్నికగన్న రచయితలు, హిమగిరినుంచి కన్యాకుమారివరకు, కచ్ నుంచి మణిపురంవరకు విస్తరించి ఉన్న ఈ విశాల దేశంలోని వివిధ నృత్యరీతులను, సంప్రదాయాలను ఉల్లేఖించడానికి ఈ గ్రంథంలో యత్నించారు.

— కమలాదేవి చటోపాధ్యాయ



1. పై చిత్రం : వెదురు నృత్యం, లూషై కొండలు
2. క్రింది చిత్రం : బుగురుంబ నృత్యం, బోడోజాతి, కచార్ కొండలు.







3. పై చిత్రం : ఘోరోల శక్తి నృత్యం

4. క్రిందిచిత్రం : సేమనాగుల యుద్ధనృత్యం





౫. పైచిత్రం : మణిపూర్ నాగజాతి నృత్యం

౬. క్రిందిచిత్రం : మోనాగజాతి వారి మోవోపివోనము నృత్యం, మణిపూర్.





౭. పైచిత్రం : నెఫా ప్రాంతంలోని ఒక నాగజాతి స్త్రీ నృత్యం
౮. క్రిందిచిత్రం : వేటనృత్యం, అంగామినాగులు





# పరిచయం

జానపదకళలన్నీ మనకు తెలియకుండానే పుట్టుకు వస్తాయి; ఇంకా బాగా చెప్పాలంటే - వాటి అంతట అవే పుట్తాయి. ప్రజల జీవితంలో అవి లోతుగా వ్రేళ్ళుపాదుకొని ఉంటాయి; అందుచేత అవి ప్రజా జీవితానికి దర్పణాలవంటి వని చెప్పవచ్చును. లోతుగా వ్రేళ్ళు పాదుకొని ఉండటమే కాకుండా వాటిలో ఉన్న స్వేచ్ఛవల్లనూ, వాటంతట అవే పుట్టటంచేతనూ, బాగా ఉండాలనే తాపత్రయమేమీ వాటిలో లేని కారణంచేతనూ శాస్త్రీయమైన కళలనుంచి అవి వేరుగా కనిపిస్తున్నాయి. భారతీయ నృత్యగానాల విషయంలో ఈ మాట ముమ్మాటికీ నిజం. ఎందుచేతనంటే, భారతీయ సంప్రదాయాన్ని అనుసరించి - గానమూ లయ జీవితంలో పాదుకొని ఉన్నవి. జీవితమంటేనే విశ్వతాళగతి యొక్క రూపాంతరం. ఆదికాలంలో అంతా జలమయంగా ఉన్నప్పుడు గానము ఆనీటిమీదుగా రాగా, ఆనీటినుండి విశ్వం రూపం ధరించింది; ఈశ్వరుడు తాండవం చేశాడు; జీవకోటి ఉద్భవించింది. ప్రజల నిత్య జీవితంలో ప్రతిపని లోను ఏదో ఒక రూపంగా లయాన్వితమైన గానం మిళితమై ఉంది - పంటకోతలు కానీయండి, నూర్పిళ్ళు, నూలువడకటం, పుల్లలు ఏరటం కానీయండి, లేక రోజువారీ క్రతువులు కానీయండి, కడపటికి మరణం కానీయండి - అన్నిటిలో ఇది

కలిసే ఉంది. పల్లెప్రజల జీవితాలకు సన్నిహితంగా ఉండే పచ్చని పంటచేలూ దయామయియైన ప్రకృతీ, ఋతుచక్రం యొక్క అనంతమైన అద్భుతాలు జానపద గానంమీద, నృత్యంమీద తమ ప్రభావముద్ర వేసినవి.

## జానపదగానం :

భారతీయులు విచారగ్రస్తులని సామాన్యంగా అనుకుంటారు. చిరకాలపు సాంస్కృతిక సంప్రదాయంయొక్క ప్రభావంచేత మనుషులలో కొంత గంభీరభావం రావచ్చు. అయితే, అటు కాశ్మీర్ నుంచి కేరళవరకు, ఇటు కథియవార్ నుంచి మణిపూర్ వరకు గ్రామీణ జీవితంలో స్పందించే శక్తినీ, ఉల్లాసాన్నీ చూస్తే ఇది నిజం కాదని ఋజువవుతుంది. మన దేశంలోని పల్లె పదాలు అనేక రకాలుగా ఉన్న మాట నిజం. అందుచేతనే, వాటిలో ఉండే భావసరళి ఇత మిద్ధమని నిర్ణయించటానికి వీలులేదు. జీవితానందాన్ని వ్యక్తపరుస్తూ, హాయిగా మైమరచి పాడేపాటలు మొదలు, ప్రియుని యెడబాసిన ప్రేయసి ఆక్రందనం వరకు, ఒకానొక కల్పిత వీరుని విజయగాథా ప్రస్తుతి మొదలు వాత్సల్యభావ పూర్ణములైన జోలపాటలవరకు వీటిలో చేరి ఉన్నాయి. పల్లె పదాలలో చాలా భాగం పనిచేస్తూ పాడేపాటలే; పనిచేస్తూ కొందరు కలసి పాడతారు; ఆ పాటలలోని లయ వారు చేసే పనిలో కదలిక ననుసరించి ఉంటుంది. ధాన్యాన్ని కొట్టేటప్పుడు, బియ్యం దంచేటప్పుడు, వర్షాకాలంలో ఊయెల లూగేటప్పుడు స్త్రీలు పాటలు పాడుతారు; కొండచరియల మీద మందను మేపుతూ గొఱ్ఱెల కాపరులు పాటలు పాడు

తారు; తెడ్లు వేస్తూ సరంగులు పాటలు పాడుతారు; ధాన్యం కొట్టేటప్పుడు, బియ్యం దంచేటప్పుడు పాడేపాటలలో క్రమం తప్పకుండా, నిర్విరామంగా తాళంపడుతుంది! ఊయెల ఊగేటప్పుడు పాడేపాటలలో దీర్ఘరాగాలు గాలిలో తేలి పోతూ ఉంటాయి. ఇంట్లో పాడుకొనేపాటలు, పెరడులో పాడుకొనేవి, కుటుంబంలో జరిగే వ్యవహారాలలో నలుగురిలో పాడే పాటలు, ఒంటరిగా పాడుకొనే పాటలు సర్వసాధారణంగా సరదాగా ఉంటాయి. ఈ పాటలలో సహజంగా ఉన్న వినోదభావం ఉత్సాహంగా చేతులతో చప్పట్లు చరచటం ద్వారానూ, మద్దెల కొట్టటం ద్వారానూ ద్విగుణీకృత మౌతున్నది; మరికొన్ని సందర్భాలలో పాడే పాటలు నిదానంగా విచార భావాన్ని వ్యక్తపరుస్తూ పాడుతారు; ఇందువల్ల ఆ యా సందర్భాలకు తగిన గాంభీర్యం ఆ పాటలకు వస్తుంది.

దేశంలో ఎక్కడ చూచినా కర్షకులు వర్షాలు కురవాలనీ పంటలు బాగా పండాలనీ చేలు ఏపుగా పెరగాలనీ కోరుతూ ఉంటారు. సముద్రంలో చేపలుపట్టే పల్లెకారుల పాటలలోనూ వారి వృత్తిలోని సుఖదుఃఖాలు నిండి ఉంటాయి. ఆదివాసుల సంగీతం అరణ్యాలలో దాగి ఉన్న అపాయాలతోనూ అనాగరికపు ఉద్రేకాలతోనూ నిండి ఉంటుంది. భారతదేశపు జానపద సంగీతంలో ప్రేమగీతాలు ప్రముఖస్థానాన్ని ఆక్రమిస్తున్నాయి. ఈ పాటలు ఏ ప్రాంతానికి సంబంధించినవైనా కరుణరసపూర్ణంగా, మరువరానివిగా ఉంటాయి. పురాణ కథాకథనం పల్లెపదాలలోని రీతు

లలో ఒకటి. భారత ప్రజల సరళ హృదయాలలో వీటికి శాశ్వతస్థానం ఉంది. ఒక్కొక్కప్పుడు ఈ గాథలలోని కథా నాయకుడు కల్పితవ్యక్తిగా ఉంటాడు. అతడు ప్రేమకోసం చెప్పరాని కష్టాలనుభవించి ప్రాణాలు కోల్పోతాడు. ఐతే తరచు ఈ పాటలు దేశచరిత్రలోని యుద్ధవీరుని గురించో, వీరమరణం పొందిన శూరుని గురించో అయి ఉంటాయి.

మతసంబంధమైన పల్లెపదాలలోని కథావస్తువు భారత దేశంయొక్క సాంస్కృతిక సామరస్యానికి నిస్సందేహమైన తార్కాణంగా పేర్కొనవచ్చును. రాధాకృష్ణుల, శివపార్వతుల పురాణగాథలు హిమాచల్ ప్రదేశ్ నుండి కన్యాకుమారి వరకు ఒకేరీతిగా గానం చేయబడుచున్నవి. మతభావ స్ఫురణలోనూ, గాన మాధుర్యంలోనూ వాటికవే సాటి. పురాణేతిహాసాలు భారత గ్రామీణ ప్రజలకు కలకాలంగా నైతిక జ్ఞానాన్ని నిక్షేపించిన భండారాలుగా ఉన్నవి; అంతే కాదు; అవి వారికి ప్రత్యక్ష వాస్తవాలు. అవి తరచు సమ కాలీన ప్రాముఖ్యాన్ని పొందుతాయి కూడాను. రకరకాల బైరాగులు భారతదేశమంతా తిరుగుతూ కనిపిస్తారు. వీరు వివిధ వేదాంత తత్త్వాల సారాన్ని ప్రజల కందించి వారి జీవిత విధానాలను, విశ్వాసాలను రూపొందిస్తూ సరిదిద్దు తున్నారు.

స్థానికమైన మార్పులున్నప్పటికీ భారతదేశమంతటా ఉన్న పల్లెపదాలలో ఎక్కువ భాగం కథావస్తువు ఒకేరీతిగా ఉంటుంది. ఐనప్పటికి వాటిలోని సంగీతరీతిలో ఒక ప్రాంతానికీ మరొక ప్రాంతానికీ చాలా తేడా ఉంటుంది.

ఈ తేడా ఆ యా ప్రాంతీయ ప్రజల స్వభావాన్నిబట్టి, వారి వారి సంస్కృతులద్వారా వారు పొందిన మార్పునుబట్టి ఉంటుంది. ఉదాహరణకు ఆటవికుల సంగీతం గ్రామ ప్రాంతాల సంగీతంకంటే ప్రాథమిక దశలో ఉంటుంది. మూడు లేక నాలుగు, ఒక్కొక్కప్పుడు ఐదు స్వరాలు మాత్రమే ఉపయోగిస్తారు. ఉత్తరప్రదేశ్‌లో చైతి, శావన్ కజ్లీవంటి ఋతుసంబంధమైన రకరకాల పాటలున్నాయి. బెంగాలులో బాటియాలీ, ఝుర్ పాటలున్నాయి. మాహియా, ఢోలక్ పాటలు పంజాబులోని విశిష్టత. వీటిని మద్దెలవాయిస్తూ మహావేగంగా పాడుతారు. గుజరాత్‌లోని గర్బా పాటలు క్షేత్రపూజనుంచి ఉద్భవించినవి. యుద్ధగాథలను వర్ణించే పొవాడా అనే పాటలు మహారాష్ట్రదేశంయొక్క ప్రత్యేకత.

భారతదేశపు పల్లెపదాలలో ఎక్కువ భాగం మద్దెల వాయిస్తూ పాడతారు. అందుచేత వాటి తాళగతులు ఖచ్చితంగా ఏర్పరచి ఉంటాయి. తమలో అంతర్భాగంగా ఉన్న సంగీతంతో అంతకు ముందే ఊగిపోతూ ఉన్న జానపద గాయకులను మద్దెలమ్రోత వివశులనుచేసి నృత్యం చెయ్యమని పిలుస్తుంది. అందుచేత భారతదేశంలోని గ్రామీణ ప్రజలలో సంగీతమూ, నృత్యమూ విడివిడిగా కాక రెండూ కలిసే ఉంటాయి. ఈ హేతువుచేత జానపదనృత్యంయొక్క రీతిలోనూ స్వభావంలోనూ కొంత మార్పు వచ్చింది. ఈ నృత్యాలన్నీ ప్రధానంగా బృందనృత్యాలు. క్రమ క్రమంగా వీటిలో కొన్ని మార్పులు సంకీర్ణతలు వచ్చి చేరినవి. వలయ నృత్యాలు, ఎనిమిది (8) అంకె ఆకారంలో

తిరుగుతూ చేసే నృత్యాలువంటి సమ్మోహనకరమైన బృంద నృత్యరీతులు వీటిలో ప్రదర్శించబడుతున్నాయి. ఇవి శాస్త్రీయ నృత్యాలలో కనిపించవు. ప్రక్క వాద్యాలు వీటిలో చాలా తక్కువగా ఉంటాయి. కాని, తాళగతులలో మాత్రం సంకీర్ణత ఉంటుంది. వీటినిబట్టే నృత్యంలో వర్గా లేర్పడుతాయి.

## జానపద నృత్యాలు :

అసంఖ్యాక జాతులతోనూ పరిస్థితులతోనూ కూడి ఉన్న భారతదేశం అనేక శతాబ్దాలుగా రకరకాల జానపద నృత్యాలకు నిలయంగా ఉంది. భారతదేశంలోని నేటి శాస్త్రీయ నృత్యవిధానాలు చాలా కట్టుబాట్లకు లోబడి ఉండటంతోపాటు ఎంతో నాజూకుతనాన్ని చూపుతున్నది. ఆటవికులగూడెములలోనూ కర్షకుల కుటీరాలలోనూ నేటికీ తమ పాటవాన్ని కోల్పోకుండా బ్రతికి ఉన్న సామాన్య ప్రజా నృత్యాలనుంచీ మన శాస్త్రీయ నృత్యాలు పుట్టినవి. భారతీయ జానపద నృత్యాలలో నిరాడంబరమైన సరళత ఉంది. వాటి సరళత వెనుక మహత్తర కళాభావాలు రెండు ఉన్నాయి; సహజమైన భావగాంభీర్యం, విస్పష్టమైన వ్యక్తీ కరణ ఉన్నాయి. జానపద నృత్యానికీ, దానినుండి ప్రధా నంగా ఉద్భవించిన శాస్త్రీయ నృత్యానికీ ఉన్న భేదం రీతి లోనే. జానపద నృత్యంలో కళారీతిని ప్రయత్న పూర్వకంగా తెచ్చుకోవటమంటూ ఉండదు. ఇందుచేతనే జానపద నృత్యంలో చిరకాలంనుంచి వస్తున్న ప్రబలమైన సంప్రదా యాలున్నప్పటికి అది స్వయం ప్రేరణతో ఉద్భవించేది

గానే ఉంది. ఈ నృత్యాలు ఇప్పటికీ బ్రతికి ఉండడమే ఈవిష యాన్ని ధ్రువపరుస్తూ ఉంది. నృత్యంచేసే వాళ్ళకు కలిగే ఆనందాన్ని కూడా ఇందుకొక అదనపు ఋజువుగ చెప్ప వచ్చును. ఈ నృత్య ప్రదర్శనలకు ప్రత్యేకంగా ప్రేక్షకు లంటూ ఉండరు. చుట్టూ మూగి చూచేవాళ్ళుకూడా ఈసా మూహిక ఆత్మవ్యక్తీకరణంలో నర్తకులవలెనే భాగస్వాము లుగా ఉంటారు. భావోద్రేకాన్ని ప్రదర్శించటంలో అభి వ్యక్తీకరణ సహజంగానూ, వాస్తవరూపంగానూ ఉండాల నేదే నిజమైనట్లయితే వాళ్ళకది తెలియదనే చెప్పవచ్చు. ఏ ఒక్క నర్తకుని సౌందర్యంగానీ ఏ ఒక్క భంగిమలోని విశిష్టతకానీ ముఖ్యం కావు. వెల్లుబుకుతున్న ఆత్మానందం; దాన్ని సునాయాసంగా నృత్యంద్వారా ద్యోతకం చెయ్యటం ఈ రెండింటి సమ్మేళనమే జానపద నృత్యంలో ప్రాధాన్యము వహిస్తుంది. ఆధునిక శాస్త్రీయ నృత్యరీతులలోవలె దీనిలో ప్రేక్షకులూ నర్తకులూ వేరు వేరు కాదు.

జానపదనృత్యాలు ప్రజాజీవితంలో పడుగు పేకలవలె అల్లుకొని ఉన్నాయి. ప్రజలు రోజూ చేసే పనిపాటులలోని అవయవ సంచలనం నుంచే జానపద నృత్యాలకు భావప్రేరణ కలుగుచున్నది. ఈ నృత్యాలలో, విత్తనాలు చల్లటం, కోతలు కొయ్యటం, వేటాడటంవంటి కొన్ని పనులకు లయా న్వితరీతులు సమకూర్చబడి, సౌందర్యవంతం చేయబడినవి. పొలాలలోనూ; అడవులలోనూ పనిచెయ్యటానికి వెళ్ళక ముందే రైతుల పిల్లలు ఈ నృత్యాలు నేర్చుకొంటారు. దీని వల్ల, వారు పెద్దయి పనిపాటలలో పాల్గొనే సందర్భంలో

వారు చేసే ప్రతి అవయవ సంచలనం సుపరిచితంగానూ, సంతోషదాయకంగానూ ఉంటుంది. అడవిజంతువుతో తల పడవలసివస్తే ఆటవికుల కుర్రవాడు జంకడు. ఎందుచేత నంటే - చిన్నతనంనుంచి అతడు వేటనృత్యాలు అభ్యాసం చేసి ఉన్నాడు. ఆ నృత్యాలు కేవలం ఒకభావాన్ని స్ఫురింప జేసే ఆచార వ్యవహారంకాదు; అడవులలో సంచరించే భయంకర జంతువులను జయించటానికి అత్యవసరమైన అవ యవ భంగిమలతో ఆ నృత్యాలు నిండిఉన్నాయి. ఇలాటి ఉదాహరణలు ఎన్నో చెప్పవచ్చును. ఇవి కేవలం ఆ నృత్య ప్రయోజనాన్నేకాక, జానపద నృత్యాలకూ ప్రజల జీవి తానికీ ఎలాటి సంబంధమున్నదో వివరిస్తాయి. భారతీయ జానపదనృత్యాలు జానపద నర్తకుల నిత్యజీవితంలో వేళ్ళు పాదుకొని ఉండటమేకాక, వారి పరిసరాలలో కూడా వ్రేళ్ళు తన్నిఉన్నాయి. ఈ పరిసరాలు జానపదనృత్యాల అభివృద్ధికి తీరు తెన్నులను కల్పించటమేకాక, నృత్యప్రదర్శనలకు అర్హమైన రంగస్థలంగా కూడా ఉపకరిస్తున్నాయి.

జానపద నర్తకుల జీవితాలతోపాటు జానపద నృత్యా లను కూడా ప్రకృతి, నిశ్శబ్దంగా, తెలియకుండా రూపొం దిస్తున్నది. వైవిధ్యానికి వాసిగన్న భారతదేశంలో జాన పద నృత్యాలలోని వైవిధ్యానికి చాలవరకు ఇదే కారణం. పర్వతప్రాంతాల నర్తకులు, ఒకరి చేతులొకరు పెనవేసుకొని, బారులుతీరి, వంగుతూ ఊగుతూ ఉంటే, అలలవలె ఉన్న హిమాలయ పర్వతపంక్తులను ప్రదర్శిస్తున్నారా అన్నట్లుం టుంది. మణిపుర నృత్యాలలోని ప్రసన్న రీతిలో ఆకస్మికంగా

కన్పించే భంగిమలమార్పు, ఉద్ధృత తాండవం—భయంకర మైన తుఫానులను, అవి చెట్టుచేమలను సమూలంగా పెళ్ళ గించటాన్ని సూచిస్తాయి. నాగ, గోండ్ జాతుల నృత్యాలలో కన్పించే నిరీక్షణ జాగరూకతలు అరణ్యాలలోని జ్ఞాతా జ్ఞాతఅపాయాలను ద్యోతకం చేస్తాయి. సౌరాష్ట్రలోని మత్స్య పారిశ్రామికుల నృత్యాలు హోరుమనే సముద్ర ఘోషను, పెల్లుబికే సముద్ర తరంగాలను సూచిస్తాయి. మైదానప్రాం తాలలోని నృత్యాలకూ వీటికీ చాలా తేడాఉంది. వాటిలో ప్రకృతియొక్క సరళభావాన్ని వ్యక్తంచేసే ప్రశాంతత, ప్రసన్నత వ్యక్తమవుతాయి.

వాతావరణ పరిస్థితుల ననుసరించి, నైసర్గిక పరిస్థితులను అనుసరించి, ఆయా ప్రాంతాల జానపద నృత్యాల స్వభావా లలో మార్పు ఉంటుంది. అయితే, వీటన్నిటిలో సమాన ధర్మాలు కొన్ని కన్పిస్తాయి. సాంఘిక నృత్యాలని చెప్పబడే వాటిలోకూడా ఈ పోలికలు ఉండనే ఉన్నాయి. ఇందుకు కారణమేమిటో చెప్పటం ఏమంత కష్టంకాదు. భారతదేశం లోని జానపదనృత్యాలలో ఎక్కువభాగం ఆచార క్రతువుల నుంచి పుట్టినవే. ఇప్పుడా క్రతువిధి ఆచారంగా కొనసాగుతూ ఉండవచ్చు, అది మతసంబంధమైనదని వెంటనే మనం గమ నింప గలిగి ఉండవచ్చు, లేదా క్షేత్రపూజా క్రతువులు మొదలు ఋతువుల ఉత్సవాలవరకుగాని లేక పంట వేడుకలు మొదలయిన వాటివరకు ఉండే భౌతిక వ్యవహారాలలో వివిధ దశలలో ఇవి ఉండవచ్చు. చివరకు యుద్ధ నృత్యాలకు కూడా క్రతువిధులే పునాదిగా ఉన్నాయి. ఒక్కొక్కప్పుడు

యుద్ధనృత్యంలో కొంతభాగం ఒకానొక దేవతను ఆమంత్రి ణచేసే విధంగా కూడా ఉంటుంది.

క్రతువిధులు పునాదిగా ఉన్నాయనే సంగతి అంగీక రించిన పిమ్మట, భారతీయ జానపద నృత్యాలను మూడు సామాన్య వర్గాలుగా విభజించవచ్చును. మత సంబంధమైన జానపద నృత్యాలలో, సామాన్యంగా కన్పించే అవకాశాన్ని మించి భావవైవిధ్యం ప్రదర్శితమౌతూ ఉంది. వీటిలో భక్తి నృత్యాలను, లేక పూజా నృత్యాలను ముందు పేర్కొన వచ్చును. ఈ నృత్యాలలో నర్తకులు తమ దేవతలకు ప్రణుతి చేసే భక్తులు మాత్రమే. ఇతర నృత్యాలలో దేవుళ్ళను, దేవతలనుగూర్చి - రాజులకు ప్రభువులకు చేసినట్లు-విన్నపాలు వేడికోళ్లు చేస్తారు. ఈ విన్నపాలు దైవీ సహాయంలేకుండా మానవులు అదుపులో పెట్టలేని భూతప్రేతాల బారినుంచి విముక్తి పొందటానికి చెయ్యవచ్చును. ఈ నృత్యాలేకాక, ఒకానొక దేవతను స్తుతిస్తూ, పురాణగాథలను అభినయిస్తూ చేసే నృత్యాలూ ఉన్నాయి. ఇలాంటి నృత్యాలకు రాధా కృష్ణుల గాథ అనంతమైన భావప్రేరణ కల్పిస్తూ ఉంది. రాధాకృష్ణుల అనంత ప్రేమగాథలోని తీవ్రాకర్షణవల్ల. ఒక్కొక్కప్పుడా కథ స్థానిక రూపాంతరాలు పొందటం తరచు సంభవిస్తూ ఉంటుంది. ఈ అనుకరణలలో మత స్వలాభం ఏమీ ఉండదు. సమకాలీన వృత్తాంతాలతో మామూలు ప్రేమగాథగా రూపొందుతాయి. శివుని వివాహ గాథ ఇట్టివాటిలో మరొక ఉదాహరణగా చెప్పవచ్చును.

యుద్ధనృత్యాలు, వీర నృత్యాలు, వేటనృత్యాలు ముఖ్యంగా ఆటవిక ప్రజలలో విస్తారంగా వ్యాప్తిలో ఉన్నాయి. ఇందుకుకారణం, ఈ భావాల ప్రేరణకు, అందుకు కావలసిన శిక్షణకు ఆస్పదమైన పరిస్థితులు ఈనాటికికూడా ఆటవిక ప్రాంతాలలోనూ దూరపు సరిహద్దు ప్రాంతాలలోనూ ఉండటమే అయితే వెనుకపడని ప్రాంతాలలోనూ, ప్రజా జీవితం సుస్థిరంగా ఉన్న ప్రాంతాలలోనూ కూడా యుద్ధ నృత్యాలు జరుగుతూనే ఉన్నాయి. కాని, ఇవి పురాణ గాథల ప్రదర్శనరూపంగానో లేక ఏదో ఒక వీరగాథను అనువైన నృత్యంలో ప్రదర్శించే రీతిగానో ఉన్నాయి.

మూడవ సామాన్యవర్గం సాంఘిక నృత్యాలు. వీటిలో చాలారకాలు ఇమిడిఉన్నాయి. కేవలం జీవితానందాన్ని వ్యక్తంచేసేవి మొదలు, ప్రకృతిలోని అద్భుతాలను వ్యక్తం చేసేవి, చేసిన కష్టంయొక్క ఫలలబ్ధిని, కుటుంబ సంఘటనలను, ప్రేమోదంతాలను వ్యక్తపరచే నృత్యాలు, లేదా సుసంఘటితమైన సమాజంగా జీవించటంలో ఉన్న సమైక్యభావాన్ని వ్యక్తపరచే నృత్యాలవరకు వీటిలో ఉన్నాయి. సాంఘిక నృత్యాలలోసైతము తక్కిన నృత్యాలలో వలెనే క్రతుభావం పూర్తిగా విలుప్తంకాదు. ఈ మూడు వర్గాలనుకూడా పూర్తిగ వేరుపరచి చెప్పటానికి వీలులేదు. అక్కడక్కడ ఇవి ఒకదానిలో ఒకటి కలిసిపోయి ఉంటాయి. ఈ కారణంచేత వర్గీకరణం కొంతవరకు అసహజంగా కన్పిస్తుంది. ఉదాహరణకు, ఆటవిక జాతిలో వేటాడటం నేటికీ సంఘటితమైన సాంఘిక కార్యకలాపంగా ఉంది. అలానే వేటనృత్యం వారి

ఉత్తమ సాంఘికాభివ్యక్తీకరణంగా ఉండవచ్చు. ఇక వైవాహిక నృత్యం సంగతిచూస్తే—ఈ విధమైన సాముదాయిక వివాహం కఠినమైన క్రతుకాండతో నిండి ఉండటంచేత, మతాచారాలలో ఉండే గాంభీర్యభావం ఈ నృత్యాలుకూడా సంతరించుకొన్నాయి. ఈ కారణంచేత జానపద నృత్యాల వర్గీకరణ ఖచ్చితంగా నిర్దేశించటానికి వీలులేదు. మనం ముఖ్యంగా జ్ఞాపకం ఉంచుకోవలసిన సంగతి ఇది—జానపద నృత్యంలో, జానపద జీవితం పరిపూర్ణంగా, సాముదాయకంగా ప్రతిఫలిస్తుంది. సరళత, నాగరికరీతులలేమి దాని నైజం; సంకీర్ణతతో నిండిఉన్నా సుదృఢమైన, సజీవమైన చైతన్యవంతమైన సమరసత దానిలో ఉంది.

# 1. హిమాలయ ప్రాంతాలు

భారతీయ జానపద నృత్యాలను ఆ యా ప్రాంతీయ భేదాలనుబట్టీ, ఆయా జాతులనుబట్టికూడా విభజించవచ్చును. ఐనప్పటికీ వివిధ ప్రాంతాల నృత్యాలలో ఒకానొక సంప్రదాయ సామరస్యం ద్యోతక మవుతుంది. మరీ ఉత్తరపు ప్రాంతాలనుంచి, దక్షిణపు కొసవరకు, తూర్పుకొన ప్రాంతాలనుంచి పటమటి కొననున్న ప్రాంతాలవరకు మనం పర్యటించిచూస్తే, అన్నిచోట్లా జానపద నృత్యాలలో ఒకే రకమైన కథాసంవిధానమూ, రీతులూ కన్పిస్తాయి. ఐతే, ఆ యా ప్రాంతాల విభిన్న పరిస్థితులనుబట్టి ఆ యా జానపద నృత్యాలలో భిన్నభిన్న సంప్రదాయా లేర్పడి ఉండటంచేత, రాష్ట్రాలవారీగా గాక, నైసర్గిక ప్రాంతాల వారీగా జానపద నృత్యాలను వర్గీకరణం చేశాము.

హిమాలయ పర్వతప్రాంతం, కాశ్మీర్‌నుండి హిమాచల్ ప్రదేశ్‌వరకు, కుమాన్‌నుండి ఉత్తర నేపాలువరకు, డార్జిలింగ్ వరకు, అచటినుండి, మణిపూర్, అస్సాం కొండల వరకు వ్యాపించిఉంది. ఈ హిమాలయ ప్రాంతాలలో వివిధ జాతులకు, గిరిజనులకు సంబంధించిన వివిధ రీతుల జానపద నృత్యాలు మనకు గోచరిస్తాయి. మొత్తంమీద వీటిని ఈ క్రింది వర్గాలుగా విభజించవచ్చును: మణిపూర్, అస్సాం కొండలలోను ఈశాన్య సరిహద్దు ప్రాంతాలలోను ఉన్న

నాగజాతుల నృత్యాలు; మణిపూర్, అస్సాం, డార్జిలింగ్, హిమాచల్ ప్రదేశ్, కుమాన్ ప్రాంతాల గ్రామసీమలలోని జానపద నృత్యాలు; ముఖ్యంగా మణిపూర్ హిమాచల్ ప్రదేశ్ ప్రాంతాలలో, నాగరికతా ప్రభావం సోకిన సాంఘిక నృత్యాలు.

## అస్సాం :

అస్సాం, మణిపూరు ప్రాంతాలు రెండూకూడా మహత్తరమైన జానపద నృత్యాలకూ, సంగీత సంప్రదాయానికీ ప్రసిద్ధి పొందినవి. అస్సాములోనూ మణిపూరులోనూ కూడా నాగరిక ప్రజలలో వైష్ణవ సంప్రదాయబద్ధమైన శ్రీ శంకర దేవబోధనల ప్రభావం ప్రస్ఫుటంగా కన్పిస్తుంది. వైష్ణవ సంప్రదాయానుసారంగా శ్రీ శంకర్ దేవ్ కామరూప నృత్యం అభ్యసించాడనీ, శాస్త్రీయ నృత్యరీతిని పెంపొందించాడనీ దానినే నేటివరకూ వైష్ణవాచార్యులు అభ్యసిస్తూ సంరక్షిస్తూ వస్తున్నారనీ అంటారు. ఈ నృత్యాలన్నీ భక్తి ప్రధానమైన నృత్యాలు; భగవంతుని యెడల భక్తుల భక్తి తాత్పర్యాన్ని ఉద్దీపింపజేయటానికే ఈ నృత్యాలు చేయబడుతున్నాయి.

ఈ నృత్యాలలో చాలామట్టుకు శ్రీకృష్ణుని బాల్య క్రీడలకు, గోపికా నృత్యాలకు సంబంధించినవే. శ్రీకృష్ణుని జీవిత వృత్తాంతాలు ఈ నృత్యాలలో సుందరంగా రూపొందించ బడినవి. కేళీగోపాల్ వంటి నృత్యంలో శ్రీకృష్ణుడు తన గోపాలసహచరులతో బాల కృష్ణుడుగా ప్రవేశిస్తాడు. అప్పుడు బకాసురుడు వస్తాడు; మ్రింగివేస్తానని బెదరిస్తాడు.

వెంటనే కృష్ణుడు అతనితో ద్వంద్వయుద్ధానికితలపడి, సంహారిస్తాడు. కృష్ణుడూ సహచరులు విజయనృత్యం చేస్తారు; గోపికలుకూడావచ్చి వారితోచేరి నృత్యం చేయటంతో మహదానందం వెల్లివిరిస్తుంది. కాని, ఆ వెనువెంటనే మరొక రాక్షసుడు వస్తాడు; కృష్ణుడతన్నికూడా సంహరిస్తాడు. ఈ విజయోత్సవాన్ని మహారాస నృత్యంద్వారా ప్రదర్శిస్తారు. ఈ నృత్యం ఇద్దరిద్దరు చొప్పున జతలుచేరి చేస్తారు; చివరినృత్యం శ్రీకృష్ణ భగవానుని దశావతారాల ప్రదర్శనంతో ముగుస్తుంది.

శ్రీకృష్ణ భగవానునకు, గోపాలురకు సంబంధించిన ఇతివృత్తాలతో కూడిన భక్తినృత్యాలేకాక, అస్సాంలో ఋతువులకు సంబంధించిన నృత్యాలుకూడా చాలాఉన్నాయి. వీటిలో కొన్ని పేరుపొంది అస్సాం వెలుపలకూడా అభ్యసించబడుతున్నాయి. వాటిలో ప్రముఖమైనవి ఈ క్రింద ఉదహరించ బడుతున్నాయి.

## 1 బిగురుంబ నృత్యం :

బగురుంబ నృత్యంలో లావణ్యం పొంగిపొరలుతూ ఉంటుంది. బోడోయువతుల నైట్‌క్లబ్బులలో ఈ నృత్యం విశేషంగా కన్పిస్తుంది. పగలంతా కష్టపడి పనిచేసిన తర్వాత, సాయంత్రంవేళల ఈ నృత్యం చేస్తారు. దీనిలో ఇతివృత్తం ప్రేమ. ఉత్సాహ వివశతకూ, మహోల్లాస గతులకు ఈ నృత్యం పేరుపొందింది. నృత్యగతులలో ఎక్కువభాగం ఏకదిశాగతులూ అర్ధచంద్రాకారగతులూ ఉంటాయి. స్థానికంగా తయారయ్యే బోడో సంగీత వాద్యాలగానం ఈ నృత్యాల ఆకర్షణను ద్విగుణీకృతం చేస్తుంది.

## 2. మెయ్‌గెనెయ్ నృత్యం :

మెయ్‌గెనెయ్ నృత్యం పంటకోతల నృత్యం. పంటలు బాగా పండిన తర్వాత బోడోజాతి స్త్రీ పురుషులు కోతలకు దిగుతారు. అప్పుడు వారు సంఘీభావాన్ని ద్యోతకం చేస్తూ చేసే నృత్యం ఇది. పంటకోతలకు సంబంధించిన వివిధ దశలను ఈ నృత్యంలో ప్రదర్శిస్తారు; పాత్రసామాగ్రులు, త్రవ్వుగోల తదితర పరికరాలు ఈ నృత్యంలో ఉపయోగిస్తారు. నర్తకులు రంగురంగుల దుస్తులు వేసుకొంటారు.

## 3. బిహు నృత్యం :

అస్సాంలో ఋతువులకు సంబంధించిన నృత్యాలలో బిహునృత్యం ప్రముఖమైనది. చైత్రమాసంజవరిరోజున ఈ నృత్యం చేస్తారు. అదేరోజున, వైశాఖి అనే పేరుతోకూడా ఈ నృత్యం చేస్తారు.

ఏప్రిలునెల మధ్యకాలంలో, ప్రకృతి బహువర్ణవసనం ధర్షించి ఉండే సమయంలో బొహాగ్ బిహు పండుగ వారం రోజులపాటు జరుగుతుంది. ఈ పండుగలో బిహు నృతం ఒకభాగం.

సందర్భానికి తగినట్లుగా ఉత్సాహాతిరేకంతో మైమరచి నత్యం చెయ్యడమే ఈ నృత్యరీతిలోని ప్రత్యేకత. దీనికి ఉద్దీపనగా శృంగారగీతాలు, భావోద్రేకాన్ని కలిగించే గీతాలు పాడుతారు.

ఈ నృత్యంలో స్త్రీపురుషులు పాల్గొంటారు. దీనిలో ఉపయోగించే వాద్య విశేషాలు ఇవి: ఢోల్, గేదెకొమ్ముతో



9. పై చిత్రం : నెఫా ప్రాంతంలోని ఒక నర్తక బృందం

10. క్రింది చిత్రం : మణిపూర్‌లోని పుంగ్‌చోలం నృత్యం







11. పై చిత్రం : థబాల్ చోంగ్బీ నృత్యం; మణిపూర్
12. క్రింది చిత్రం: రాస నృత్యం; మణిపూర్





13. పై చిత్రం : నాగా నృత్యం; మణిపూర్
14. క్రింది చిత్రం : ఝుం నృత్యం; అబోర్ కొం[illegible]





15. పైచిత్రం : సిక్కిం లామాల వాద్య సమ్మేళనము
16. క్రిందిచిత్రం : లామాల ముసుగు నృత్యం; డార్జిలింగ్



స్థానికంగా తయారు చేయబడిన పేపా అనే మురళి, వెదురు బొంగుతో తయారుచేసిన టాకా అనబడే వాద్యము.

అస్సాం గిరిజనుల నృత్యాలలో ఖాశీజాతివారి నృత్యం చాలా ప్రధానమైనది. భారతదేశంలోని గిరిజనులందరిలో ఖాశీజాతివారు చాలా అందంగా ఉంటారు. ఖాశీనృత్యం లోని భంగిమలు—బిర్రబిగిసిన చందంగానూ, కొయ్యబారి నట్లు ఉంటాయి. ఢోల్ యొక్క తాళగతి తప్పకుండా పాదగతిని ఎంత సమన్వయం చేస్తూ ఎంత చక్కగా నృత్యం చేస్తే అది అంత చక్కని నృత్యంగా ఎంచబడుతుంది. వీరి నృత్యంలో హస్తాభినయంకూడా ఎక్కువగానే ఉంటుంది. జానపద నృత్యాలలో ఇంత ఎక్కువ హస్తాభినయం మరె క్కడా కనిపించదు.

ఈ ఖాశీజాతివారేగాక, లూషై కొండలలోను, గారో కొండలలోను, బ్రహ్మపుత్ర లోయలోను నివసించే ముఖ్య మైన గిరిజన జాతులు మరికొన్ని ఉన్నాయి ఈ జాతులలో అనేకరకాల నృత్యాలు ఉన్నాయి. వీటిలో వెదురు నృత్యం, వేట నృత్యం వంటివి మొదలుకొని, నాగనృత్యాలకు అతి సన్నిహితంగా కనిపించే యుద్ధ నృత్యాల వంటివి కూడా ఉన్నాయి.

ఈ గిరిజనుల నృత్యాలలో సరళమైన వాటిలో లూషై వెదురు నృత్యం ఒకటి అని నిస్సందేహంగా చెప్పవచ్చు. ఈ నృత్యంలో స్త్రీలు, పురుషులుకూడా పాల్గొంటారు; లూషైజాతులు, మెజో నాగజాతులుకూడా ఈ నృత్యం చేస్తారు.

చదరంగా నేలమీద వెదురుబొంగులు ఉంచుతారు; రంగురంగుల దుస్తులు వేసుకొన్న కొందరు యువతులు పాటలు పాడుతూ, వాద్య గానానికి అనుగుణంగా, ఆ చదరా లను దాటుతారు. కొందరు నర్తకులు వెదురుబొంగులను చేతులతో పట్టుకొని ఒకదానిమీద ఒకటి కొట్టూ తాళ యుక్తమైన శబ్దాలను సృష్టిస్తారు.

## ఖౌల్లి నృత్యం:

ఇది అస్సాంలోని మిజోజాతివారు చేసే గిరిజననృత్యం. ఈ నృత్యం అతిథుల నృత్యం; ఎందుచేతనంటే – గృహస్థుల ఇండ్లకు వెళ్ళేటప్పుడు అతిథులు ఈ నృత్యం చేస్తారు. పండుగ పబ్బాల సందర్భంలో అతిథులను ఆహ్వానించే గృహస్థుచేసే క్రతువులలో ఈ నృత్యం ఒక భాగంగా ఉంటుంది. ఇది బృంద నృత్యం; స్త్రీలూ, పురుషులూ కలిసి పాల్గొంటారు. మెల్లగా అడుగులువేస్తూ సరళగతులతో నృత్యం ఆరంభ మవుతుంది. కొంతసేపైన తర్వాత నర్తకులు వర్గాలుగా ఏర్పడుతారు; స్త్రీలూ, పురుషులూ తమతమ స్థానాలు మార్పిడిచేసుకొంటూ ఏకదిశాగతులలోను అర్ధచంద్రాకార గతులలోను సరళగతులతో నృత్యం చేస్తారు.

గారో కొండల జిల్లాలో నివసించే గిరిజనులలో గారో నృత్యం పరిపాటిగా కనిపిస్తుంది. కొందరు స్త్రీ పురుషులు డోళ్ళు వాయిస్తుంటారు; వెదురు పిల్లనగ్రోవులు ఊదు తుంటారు; కొమ్ములూదుతుంటారు. ముందుకూ వెనక్కూ నడుస్తూ అప్పుడప్పుడు ఒకరిచుట్టు ఒకరు నృత్యం చేస్తారు.

మైదాన ప్రాంతాలలోని గిరిజనులు మిరిహుషారీ నృత్యం చేస్తారు. హుషారీ నృత్యం ఈ జాతి ప్రజలకు చాలా అభిమానపాత్రమైన నృత్యం. గిరిజనుల వాద్య సంగీతానికి అనుగుణంగా యువతులు, యువకులు పాడుతూ నృత్యం చేస్తారు. ఈ నృత్యం ఉత్సాహంతోనిండి కళ్ళపండుగగా ఉంటుంది. ప్రపంచ జానపద నృత్యాలలోని సామాన్యరీతులన్నీ ఇందులో ఉన్నాయి.

బ్రహ్మపుత్ర లోయలో కచ్చారీ లనబడే ప్రాచీన గిరిజను లున్నారు. అస్సాంలోనూ అస్సాం సరిహద్దునఉన్న ప్రాంతాలలోనూ వీరిని రకరకాల పేరులతో పిలుస్తున్నారు. వీరిలో ఉత్తర కచార్ కొండలలో నివసిస్తున్నవారిని బోడో జాతి అని పిలుస్తారు. వీరు ఆదికాలంలో ఇండో - చైనా జాతికి సంబంధించినవారు; అస్సాంయొక్క ఉమ్మడి సంస్కృతికి వీరు చాలా తోడ్పడ్డారు. బొడో జానపద నృత్యాలు స్వతంత్ర భావనకు పేరుపొందినవి; అంతేకాక యుగాల పర్యంతం ఇవి తమ స్వచ్ఛతను సంరక్షించుకొన్నవి. వీటిలో యుద్ధనృత్యాలవంటి వాటినుంచి శృంగార నృత్యాల వరకూ ఉన్నాయి.

## వేట నృత్యం:

దక్షిణ అస్సాంలోని కొండల ప్రాంతాలలో జైత్యులు అనే కొండజాతులవా రున్నారు. వీరు అనేక రకాల జానపద నృత్యాలు చేస్తారు. సంకీర్ణమూ, వీర్యద్యోతకమూనైన వీరనృత్యాలు మొదలు, అతిసరళమైన, కర్షకుల పంట నృత్యాలవరకు వీటిలో ఉన్నాయి. వీరు చేసే మతసంబంధ

మైన పండుగలలోనూ, సాంఘిక ఉత్సవాలలోనూ ఆటల లోనూ కూడా నృత్యం, సంగీతం ఒక ముఖ్య భాగంగా ఉంటుంది.

వేటలలో వివిధదశలలో కన్పడే అవయువ చలనాన్ని, పనులను, చిట్టచివరకు క్రూరమృగాన్ని చంపే పద్ధతినీ వేట నృత్యంలో ప్రదర్శిస్తారు. ఈ నృత్యంలో భీత్యానహమైన వాతావరణాన్ని కల్పించటంద్వారానూ నృత్యంయొక్క గతిని ఉద్ధృతం చెయ్యటంద్వారానూ గిరిజనుల డోల్ వాద్యం ముఖ్యపాత్ర వహిస్తుంది.

లా హో :

జైత్యజాతివారుచేసే మరొక సుందరనృత్యం లాహో నృత్యం. మతసంబంధమైన ప్రముఖ ఉత్సవాల సందర్భంలో ఈ నృత్యం చేస్తారు.

ఈ నృత్యాలలో నర్తకులు వర్గాలుగా ఏర్పడుతారు- ఒక్కొక్క వర్గంలో సర్వసాధారణంగా ఇద్దరు పురుషులు ఒక యువతి ఉంటారు - కన్నుల పండుగగా రంగు రంగుల దుస్తులు ధరించి, ఒకరి ప్రక్కన ఒకరు నిలుస్తారు. ఆతర్వాత డోళ్ళధ్వనుల ననుసరించి, స్థానాలు మారుస్తూ, గతులు మారుస్తూ చుట్టు నృత్యం చేస్తారు. ఈ నృత్యంలోని శోభయే దీని ప్రసిద్ధికి కారణం.

నా గ నృ త్యా లు :

భారతదేశంలోని అత్యంత దర్శనీయమూ, వీర్యవంత మూనైన కొన్ని నృత్యాలు నాగజాతి ప్రజలలో ఉన్నాయి. అస్సాం, ఉత్తరబర్మా సరిహద్దు ప్రాంతంలో నాగజాతి

ప్రజలు నివసిస్తున్నారు. నాగ ప్రజలలో అనేకజాతులున్నాయి. ప్రతి జాతికి విలక్షణమైన నృత్యాలున్నాయి. వీటిలో ఎక్కువ ప్రసిద్ధిపొందిన నృత్యాలు నాగుల యుద్ధ నృత్యాలు. ఈ నృత్యాలు అస్సాంలోనూ, మణిపూరులోనూ, వాటి పూర్వ రూపం ఏమాత్రం చెడకుండా సంరక్షించబడ్డాయి. నాగ నర్తకులు ముఖాలకు యుద్ధవర్ణంపూసుకొని, తలపై కొమ్ములు, పిట్టల ఈకలు పెట్టుకొని, పూసలు, రాళ్ళు, కొమ్ములతో చేసిన సొమ్ములు, ఒక్కొక్కప్పుడు ఎముకలతో చేసిన ఆభరణాలు ధరించి నృత్యం చేస్తారు.

అన్ని నాగజాతులవారూ శూలనృత్యం చేస్తారు. పొడవాటి శూలాలను నెత్తిమీద ఝుళిపిస్తూ, శత్రువులపైకి విసరివేస్తున్నట్లు నటిస్తూ, మహావేగంతో తన కాళ్ళమీదనే పొడుచుకుంటూ, తన ఆయుధం వ్రేటునుంచి తానే చమత్కారంగా తప్పుకుంటూ నృత్యం చేస్తారు.

నెజ్మీనాగులు మృగాల గతులను అభినయించే కొన్ని రకాల ప్రత్యేక నృత్యాలు చేస్తారు. వీరి నృత్యాలలో లీ నృత్యం, ఇబెరితపక్షి నృత్యం ప్రత్యేకంగా పేర్కొన తగినవి. ఇబెరితపక్షి చాలా అరుదుగా కన్పిస్తుంది. నాగవీరులకు ఈ పక్షి ఈకలంటే చాలా ప్రీతి.

కబూయ్ నాగజాతి స్త్రీలు ఒకరకమైన నృత్యం చేస్తారు. ఇది విలక్షణమైన అవయవ సంచలన రీతులతో నిండి ఉంటుంది. ఈ నృత్యం, క్రిందకూర్చుని చేతులను యంత్రాల వలె త్రిప్పుతూ, క్షేత్రగణిత రేఖలను బోలినరీతుల ప్రదర్శిస్తూ ఆరంభిస్తారు. తర్వాత లేచి, ఒక కాలితో ముందడుగు వేస్తూ

రెండవకాలి పాదంతో ఆవలి పిరుదు క్రిందిభాగాన్ని చరుస్తూ చప్పుడు పుట్టిస్తారు.

జెమీ జాతివారు ఉత్తర కచార్ కొండలలో నివసిస్తు న్నారు. వీరుకూడా నాగజాతివారుగానే పరిగణించబడు తున్నప్పటికీని, కొండప్రాంతాలలో ఉండే నాగజాతివారికీ వీరికీ చాలా తేడా ఉంది. ఈ జాతివారు ముఖ్యంగా వేటాడే జాతివారైనప్పటికీ వీరి ప్రధానవృత్తి వ్యవసాయం; వీరు అనేక రకాల జానపద నృత్యాలకు ఆటపట్టుగా ఉన్నారు. ఈ నృత్యాలలో ఎక్కువ ప్రశస్తి పొందినవి ఖంబాలిం, న్రూయ్‌రాలిం నృత్యాలు.

పంటకోతలకాలం ఆరంభంలో స్త్రీపురుషులు వేర్వేరు బృందాలుగా ఏర్పడి ఖంబాలిం నృత్యంచేస్తారు. స్త్రీలు ఒక వరుసలోనూ పురుషులు ఒకవరుసలోను నిలుస్తారు. నృత్యం చేస్తూ తమతమ స్థానాలు మారుస్తూ ఉంటారు. కాని, రెండు వరుసలూ చెదరిపోకుండా ఉంటాయి.

న్రూయ్‌రాలిం, లేక కోడిపుంజుల పోట్లాట నృత్యంలో యువతీ యువకులు ఎదురెదురుగా నిలువబడి, యుద్ధం చేస్తు న్నట్లు అభినయిస్తారు. ఈ నృత్యానికి ప్రత్యేక తాత్పర్య మేమీ లేదు. అందరూ కులాసాగా ఉన్నప్పుడెప్పుడైనా ఈ నృత్యం చేస్తారు.

కూకినాగ జాతివారు ఒకరకం నృత్యం చేస్తారు. ఈ నృత్యంలో నాలుగు పొడవాటి వెదురు బొంగులు ఒకదాని కొకటి జోడించి, చదరంగం ఏర్పడేట్లు పెట్టారు. ఈ గడల చివర కొందరు కూర్చొని, డోల్ వాద్యానికి అనుగుణంగా

ఈ చదరపు గదిని మూస్తూ తెరుస్తూ ఉంటారు. గది మూలలు తెరుచుకున్నప్పుడు లోపలికి వెళ్తూ, మూసుకొన్నప్పుడు బైటికి వస్తూ నర్తకుడు ఒంటికాలుమీద గంతులేస్తూ ఉంటాడు. ఒకే నర్తకుడు కాకుండా ఇద్దరు ముగ్గురు నర్తకులు కలిసి వెదురుబొంగు రీతిలో నృత్యం చేసేటప్పుడు గమన రీతులలో సంకీర్ణత ఏర్పడటమేకాక, డోళ్ళ మ్రోతకూడా ఉద్ధృతంగా సాగుతుంది. ఇది ఇంతకుముందు మనం చెప్పుకొన్న మిజో నాగుల వెదురుగడ నృత్యాన్ని, లూషైజాతివారి వెదురుగడ నృత్యాన్ని పోలి ఉంటుంది.

అస్సాంలోని నాగనృత్యాలన్నిటిలో అత్యంత ప్రసిద్ధి పొందింది సెమనాగ నృత్యం. పెద్ద మంటచూట్టూ నర్తకులు యుద్ధ నినాదాలుచేస్తూ వీరనృత్యం చేస్తారు. ఈ నినాదాల వల్ల నృత్యంలో భయానక వాతావరణం ఏర్పడుతుంది. ఈ వీరనర్తకులు ధరించే వేషం వారు చేసిన వీరసాహస కృత్యాలకు చిహ్నంగా ఉంటుంది. ఉదాహరణకు: తలమీద పెట్టుకునే ఈకలు, ఆ యుద్ధవీరుడు అనేకశత్రువుల తలలు నరికినట్లు సూచిస్తాయి.

నాగనృత్యాలన్నింటిలో పాదగతులకు ఎక్కువ ప్రాముఖ్యం ఉంటుంది. వందలకొలది నర్తకులు అడుగు తప్పకుండా నృత్యంచేస్తున్న దృశ్యం చూస్తే ఎంతో ఉద్రేకం కలుగుతుంది. ఈప్రాంతపు నాగనృత్యాలలోని వేగం చూచి నమ్మవలసిందేగాని చెప్తే,నమ్మకం కలుగదు.

అయితే, నాగనృత్యాలు కేవలం యుద్ధనృత్యాలకే పరిమితమైలేవు. తమ పూర్వీకుల పూజకు సంబంధించిన ఇతి

వృత్తాలుగల కొన్ని నృత్యాలుకూడా ఉన్నాయి. ఇలాంటి నృత్యాలలో ఒకటి అస్సాంలోని నాగకొండల జిల్లాలలో ఉన్న మొకుక్ చంగ్ ప్రాంతంలోఉండే ఓసింగటంజాతులు చేస్తారు. తమ దైనందిన జీవితాన్ని ఉత్సాహపూరితం చెయ్యటానికి గిరిజనులువేసే గంతులవంటివికూడా ఈ నృత్యాలలో కొన్ని ఉంటాయి. వీరుచేసే నృత్యాలలో ఒక నృత్యం మూడుభాగాలుగా ఉంటుంది. మొదటి భాగంలో యువకులు మెరిసే ఈకలను ధరించి, తళతళలాడే శూలాలను పట్టుకొని గ్రామంచుట్టూ నృత్యం చేస్తారు. రెండవభాగంలో యుద్ధపు విందులో మిగిలిపోయిన భోజనపదార్థాలచుట్టూ కాకులలాగా అభినయిస్తూ అటు ఇటు గంతులు వేస్తారు. చివరిభాగంలో చేసే నృత్యంలో వాళ్ళ పెంపుడు జంతువులు కూడా పాల్గొంటాయి. నృత్య రంగంమీద నర్తకులు కాళ్ళతో మట్టుతూ, మదించిన ఎనుబోతుల్లాగా ఢీకొంటారు.

ఈ కొండలలో, నాగజాతి నృత్యరీతులు లెక్కలేనన్ని ఉన్నాయి; పైన వివరించినది వాటి సమగ్ర స్వరూపం కాజాలదు. ఈ నృత్యాలలో కొన్నిటి ఇతి వృత్తమూ, రూపమూ మణిపూరు, ఈశాన్య సరిహద్దు ప్రాంతాల నాగ నృత్యాలను పోలిఉంటాయి.

## మణిపూర్ :

అస్సాంలోవలెనే మణిపూర్‌లోకూడా అనేక రకాల గిరిజన నృత్యాలూ జానపద నృత్యాలూ ఉన్నాయి. మణిపూరులో చాలా ప్రాచీనకాలపు నృత్యాలు కొన్ని ఉన్నాయి. ఇవి భారతదేశంలో అన్నిచోట్ల కన్పిస్తాయి; అంతేకాక, ఆధునిక నృత్యాలలోనూ అత్యంత నవీన నృత్యరీతులలోనూ ఇవి కన్పిస్తాయి. నిజానికి ఇంతటి అనంత వైవిధ్యంకల నృత్యరీతు లుండటంచేత, భారత శాస్త్రీయ నృత్యాలకూ జానపద నృత్యాలకూ మణిపూరు పుట్టినిల్లని గర్వించతగి ఉంది.

భక్తి నృత్యాలలోనూ మతసంబంధమైన నృత్యాలలోనూ రాసనృత్యం, లాయ్‌హెరోబ, తబల్ చోంగ్‌బీ నృత్యాలు పేరుగన్నవి. నాగజాతి నృత్యాలలోనూ గిరిజన నృత్యాలలోనూ మోనాగాజాతి నృత్యాలు, కబుయ్ నాగా జాతి నృత్యాలు ప్రసిద్ధి పొందినవి.

మణిపూరు జానపద నృత్యాలలోకెల్ల లాయ్‌హారోబి నృత్యం విస్తృత నృత్యమే కాకుండా అతి ప్రాచీనమైనదీ, చాలా నాజూకైనదీ కూడాను. ఈ నృత్యాలలో పురాణేతిహాసగాథలు ఇతివృత్తాలుగా ఉంటాయి. మణిపూరు ప్రజా జీవితంలో పురాణేతిహాసాలు కలిసిపోయి ఉన్నాయి. శివ పార్వతు లిరువురూ ఒక లీలను సృష్టించారనీ, ఎగువ

హిమాలయాలలో ఉన్న తమ ఆవాసాన్ని విడిచి, మరొక చోటున నివాస స్థలంకోసం అన్వేషిస్తూ ఉండగా, మణిపూరు చుట్టూ ఉన్న కొండలమీదనుంచి శివుడు క్రిందికి చూచాడనీ, జలంతో నిండిన సుందరమైన లోయ ఆయనకు కనిపించిందనీ అంటారు. అప్పుడాయన తన త్రిశూలాన్ని పర్వతాలమీద పొడిచాడనీ, వెంటనే ఆ నీరంతా ఇంకిపోయి, నేడు మణిపూరని చెప్పబడుతున్న విశాల సుందర నాట్యరంగం ఏర్పడిందనీ చెప్తారు.

శివపార్వతుల ఈ లీలను ప్రదర్శించేదే లైహరాబా నృత్యం. ఇప్పుడది ప్రదర్శింపబడే రూపం గ్రామ దేవతలకు అంకితం చేయబడి ఉంది. ఈ నృత్య ప్రదర్శనంలో మైబాన్ (పురోహితుడు), మైబీస్ (పురోహితురాలు) ప్రముఖపాత్ర నిర్వహిస్తారు. ఈ నృత్యం కొంతభాగం క్రతువిధులతో నిండి ఉంటుంది; కొంత వినోదకరంగా ఉంటుంది. తుమ్మెదలకూ పూవులకూ ఉన్న సంబంధాన్ని సంకేతాలద్వారా తెలియపరుస్తూ, ఆ సంకేతాల ద్వారానే ప్రపంచంయొక్కయు, మానవులయొక్కయు సృష్టిని ఈ నృత్యం ప్రదర్శిస్తుంది. నృత్యంచేస్తూఉండగా నర్తకులకు పూనకంరావటం, అప్పుడు వారు ఖంబ (శివ) థొయంబి (పార్వతి)ల అమర ప్రేమగాథను ప్రదర్శించటంతో నృత్యం పరాకాష్ట నందుకొంటుంది.

అస్సాంలోవలెనే మణిపూర్‌లోకూడా వైష్ణవ సంప్రదాయ ప్రభావం బాగా పాదుకొన్నది; అయితే శంకర్‌దేవ్ బోధలుకాక, మణిపూరులో, చైతన్య బోధల ననుసరించిన వైష్ణవమతం సజీవ సంప్రదాయంగా ఉంది. ' ప్రజలలో

ఎక్కువ ప్రచారంలోఉన్న సంగీతరూపం కీర్తన. గానంలో పారవశ్యం ఎక్కువయ్యే కొద్దీ గాయకులూ వాద్యగాళ్ళూ ఒకరొకరే నిలువబడి, సంగీతాని కనుగుణంగా, ఎవరికి వారుగాగానీ జంటలుగాగానీ నృత్యం చేస్తారు. భక్తి పార వశ్యంతో కూడిన ఈ గానం సంప్రదాయంనుంచే చాలా నృత్యరూపాలు రూపొందినవి. ఈనృత్యరూపాలన్నీ శాస్త్రీయ నృత్యాలలో పొందుపరచబడినవి. వీనిలో బాగా ప్రసిద్ధ మైనవి ఫుంగ్ భోలం, కర్తాళ్ భోలం నృత్యాలు. భోలం అనే మాటకు అర్థం వేగ గతి. కీర్తన పాడేటప్పుడు డోలు కొట్టే వాడు, తాళం కొట్టేవాడు భక్తి సంగీత పారవశ్యంలో పూర్తిగా మునిగిపోయి ఉంటారు. అప్పటి వారి శరీర గతు లను ఈ మాట సూచిస్తుంది.

ఫుంగ్ చోలనృత్యం ఒక్కరొకరుగాగానీ బృదంగాగానీ చేస్తారు. మణిపూరువారు వాయించే డోల్ మృదంగంలాగా ఉండి శబ్దంమాత్రం వేరుగా ఉంటుంది. ఇతరరకాల డోలు వాద్యాలకంటే దీనిశబ్దం చాలా దూరం వినిపిస్తుంది. బహు నిదానంగా సరళమైన పాదగతులతో ఆరంభించి, బ్రహ్మాండ మైన వేగంతో ఈ నృత్యం చెయ్యటంచూస్తే, ఇవి జానపద నృత్యాలకంటే శాస్త్రీయ నృత్యాలకే ఎక్కువగా చెందుతా యని చెప్పవచ్చు. కాని, ఫుంగ్ చోలంనృత్యం నిజానికి మణి పూరు గ్రామాల భక్తి నృత్యాలకు సంబంధించినది కావటం చేత జానపద నృత్యవర్గంనుంచి దీనిని వేరు చెయ్యటానికి కూడా వీలులేదు.

రాసలీలా నృత్యం ఎక్కువగా లాయ్‌హరోబా నృత్యాన్ని పోలి ఉంటుంది. రాసలీలా నృత్యంలోని ఇతి వృత్తం రాధాకృష్ణుల ప్రేమగాథ. మణిపూర్ రాసలీలా నృత్యాలు ఒక ప్రత్యేక వర్గమని చెప్పవచ్చును. వీటిని జానపద నృత్యాలుగానో శాస్త్రీయ నృత్యాలుగానో కూడా నిర్ధారణ చెయ్యవచ్చును. భారతదేశంలోని ఇతర శాస్త్రీయ నృత్యరీతు లన్నీ వీటిలో ఉన్నాయి. నేను మణిపూర్‌లో వ్యాప్తిలోఉన్న రాస నృత్యాలు చాలా ప్రాచీనమైనవి కావనీ, ఇవి నిజానికి మహారాజా జయసింగ్ చేత సృష్టించ బడినవనీ అంటారు. మహారాజా జయసింగ్ దరిమిలా 'భాగ్యచంద్ర' అనేపేరుతో పిలువబడ్డాడు. ఈయన క్రీ.శ. 1770 ప్రాంతంలో ఉన్నాడు. మహారాజా జయసింగ్ ఒక స్వప్నంలో ఈ నృత్యాన్ని స్పష్టంగా దర్శించాడనీ, అందులో సంగీతం విన్నాడనీ, నర్తకుల వేషభాషలను, గతులను వివరంగా స్పష్టంగా చూశాడనీ చెప్తారు. ఆయన కూతురు నృత్య విద్యలో అందెవేసిన చెయ్యిఅనీ, ఆయన ఆమెను పిలిపించి, తాను కలలో చూచిన రాసలీలా నృత్యం చేయించాడనీ చెప్తారు. ఈ కథసంగతి ఎలా ఉన్నప్పటికీ, రాసలీలా నృత్యం జయసింగ్ స్వప్నానికంటే చాలా పూర్వకాలంనుంచి ఉన్న దని గట్టిగా చెప్పవచ్చును. భారతదేశంలో రాసనృత్యాలు ప్రాచీనకాలంనుంచీ ఉన్నాయి. భాగవతంవంటి పురాణా లలో ఈ నృత్యం వివరంగా వర్ణించబడింది. మణిపూరులో నేడు ప్రదర్శించబడే నృత్యాలను చూస్తే పురాణాలలోని ప్రేమలీలల వర్ణన జ్ఞప్తికివస్తుంది. భారతదేశంలో ఏ ప్రాం

తానికా ప్రాంతం, ఈ రాసనృత్య ఇతి వృత్తాన్ని, తన ప్రాంతీయ సాహిత్యానికి, మతసంప్రదాయాలకు అనుగుణంగా ఏవిధంగా నప్పుకున్నవో గమనిస్తే ఆశ్చర్యం కలుగుతుంది.

రాసలీలలలో అనేక రీతులున్నాయి. వసంత రాస నృత్యం మార్చి - ఏప్రిలు నెలలమధ్య పౌర్ణమిరోజు చేస్తారు. ఈ ఇతివృత్తంలోని సారాంశం, రాధాకృష్ణుల సమైక్యము; అయితే ఈ సమైక్యభావం బాధాకరమైన అనుభవం తర్వాత సిద్ధిస్తుంది. శ్రీకృష్ణుని అన్యకాంతాసక్తివల్ల రాధకు బాధ, కోపం కలుగుతాయి. ముందు ఆమె కృష్ణున్ని నిరాకరిస్తుంది. తనను మన్నించవలసిందిగా శ్రీకృష్ణుడు రాధను వేడుకొంటాడు. "నీపాదాలచెంత సాష్టాంగపడతాను; నీవు లేకుండా, నీ ప్రేమలేకుండా నేను బ్రతుకలేను" అంటాడు. చాలాసేపు బ్రతిమలాడి, పశ్చాత్తప్తుడైన శ్రీకృష్ణుడు రాధను ప్రసన్నం చేసుకొంటాడు.

కుంజ రాసనృత్యం దసరా రోజులలో చేస్తారు. ఈ నృత్యంలో గాఢత కొంచెం తక్కువగా ఉంటుంది. ఆదర్శ ప్రేమికులుగా భావించబడుతూ ఉన్న రాధాకృష్ణుల నిత్య జీవితాన్ని ఈ నృత్యం ప్రదర్శిస్తుంది. ఇందులో వియోగం లేదు; పరస్పర సమక్షంలో ఇద్దరూ వినోదంగా హాయిగా ఉంటారు.

మహారాస నృత్యం డిశెంబరు నెలలో పౌర్ణమిరోజున ప్రదర్శిస్తారు. ఇందులో ఆ అమర ప్రేమికుల వియోగాన్ని వ్యక్తంచేస్తారు. కృష్ణుడు రాధను త్యజిస్తాడు; రాధ ప్రాణత్యాగం చేస్తానని బెదిరిస్తుంది; చివరకు కృష్ణుడు ఆమె దగ్గరకు వస్తాడు.

వీటితోపాటు మరికొన్ని రాసలీలా నృత్యాలుకూడా ఉన్నాయి. ఉదాహరణకు: నిత్యరాస నృత్యం. సంవత్సరంలో ఏరోజునైనా ప్రదర్శించవచ్చు. దివారాస నృత్యం. పగటివేళ మాత్రమే ప్రదర్శించబడుతుంది. నటనారాస నృత్యం. ఎనిమిదిమంది గోపికలు శ్రీకృష్ణునితో నాట్యంచేస్తారు. అష్ట గోపీ అష్ట శ్యామ రాస నృత్యం. వసంతకాలంలో ప్రదర్శిస్తారు. దీనిపేరు సూచించే విధంగా ఇందులో ఎనిమిదిమంది గోపికలు, ఎనిమిదిమంది కృష్ణులు పాల్గొంటారు.

సంప్రదాయ రాసలీల వేషం చాలా అలంకరణలతో రంగురంగులతో ప్రకాశమానంగా ఉంటుంది. ప్రక్క-సంగీతం, విసుగుపుట్టకుండా నేర్పుగా అనేక రీతులుగా పాడతారు.

కేవల నృత్యాలన్నింటికీ తోడుగా వాద్య సంగీతం ఉంటుంది. నర్తకులు పాట ఆపి మరింతస్వేచ్ఛగా అభినయం చెయ్యటానికి వీలుగా అప్పుడప్పుడు ఇద్దరు స్త్రీలు పాట పాడుతుంటారు.

స్త్రీలు రాధ పాడే పాటలూ, పురుషులు శ్రీకృష్ణుడు పాడే పాటలూ పాడతారు. రాసలీలను ఈ క్రింది రీతిగా ఆరు దశలుగా లేక భాగాలుగా విభ ప వచ్చును.

1. శ్రీకృష్ణుడు ప్రవేశించి నృత్యంచెయ్యటం.
2. రాధప్రవేశించి నృత్యం చెయ్యటం.
3. రాధాకృష్ణులు కలిసి నృత్యం చెయ్యటం.
4. రాధగానీ, కృష్ణుడుగానీ కలిసి నృత్యం చెయ్యటానికి నిరాకరించినప్పుడు సంభవించే సంవాదం; ఆ తర్వాత బ్రతిమలాడటం.

5. రాధాకృష్ణుల కలయిక; గోపికలతో వారు ఆనందంగా నృత్యం చెయ్యటం.
6. ప్రార్థన; రాధ, గోపికలూ, కృష్ణునియెడ శాశ్వత భక్తి ప్రమాణం చెయ్యడం.

మణిపూరి రాసనృత్యం ప్రధానంగా భావోద్రేక పూరితమైన నాట్యమైనప్పటికీన్నీ, దాని ప్రదర్శనలో చాలా గొప్ప కళాకౌశలం ఉంది.

మణిపూరి నృత్యంలో ప్రధానమైనవి పూర్ణచక్ర గతులూ, అర్ధచక్ర గతులున్నూ, కురుంబ, లేక వందన నృత్యంలో చేతిమణికట్టులు రెండూ జోడించి, రెండు పర్యాయాలు త్రిప్పుతారు. నృత్యంలోని ప్రతిదశ ఈ రీతితో అంతమవుతూ ఉంటుంది. చరఖా లేక వడకుట అనేది మరొక హస్త విన్యాసం; దీనిలో చేతివ్రేళ్ళను విప్పి, శరీరం వైపు మెలికలు త్రిప్పుతారు. మణిపూరీ నృత్యంలోని హస్త విన్యాసాలలో లాస్యభావం ప్రధానపాత్ర వహించటం గమనార్హం. అయితే, తాండవం లేక ఉద్ధృత నృత్యం పర్గ్ భోలంవంటి నృత్యాలలో పాదచలనం ద్వారా ప్రదర్శించ బడుతున్నది.

ఋతువులకు సంబంధించిన మణిపూరు నృత్యాలలో థాబల్ ఛోంబీ నృత్యం ఎక్కువ ఉల్లాసకరమైన సాంఘిక నృత్యాలలో ఒకటి. ఈ నృత్యం హోలీపండుగ రోజులలో చేస్తారు. ఈ మాటకు వెన్నెలలో గంతులు వెయ్యటం అని అర్థం. థాబల్ ఛోంబీనృత్యంలో కులము, హోదాలతో నిమిత్తం లేకుండా అందరూ పాల్గొనవచ్చును. రాస

నృత్యాలలో పాల్గొనటానికిగానీ నృత్యం సందర్శించటానికిగానీ వైష్ణవులకు తప్ప ఇతరులకు వీలులేదు. థాబల్ ఛోంబీ నృత్యంలో అలాకాదు. ఈ నృత్యం జరిగేటప్పుడు కులమత భేదాలు వుండవు; ఆ రోజు తక్కువ వాళ్ళూ, ఎక్కువ వాళ్లూ యువతీయువకులు, వృద్ధులూ అందరూ కలవవచ్చు. మణిపూరు బాలబాలికలకు, థబల్ ఛోంబీ నృత్య సందర్భంలో అంతులేని స్వేచ్ఛ ఇస్తారు. వాళ్ళు తమ ఇష్టంవచ్చినంతసేపు బైట తిరగవచ్చు.

మణిపూర్ లోని ఇతర గిరిజన నృత్యాలలో హెలోయ్ నృత్యం వంటివి వున్నాయి. ఈ నృత్యాలలో, అడవి సమీపంలో ఉన్న ఒక బయలులో హెలోయ్ 'దేవకన్యలు' ఏడుగురు ఖేలగా నృత్యం చేస్తూ ఉంటారు. ఆ అప్పచెల్లెళ్ళలో చిన్న చెల్లెలు, ఒక యువకుడు అటురావటం చూస్తుంది. ఆమె నిర్భయంగా అతనికెదురుగా వెళ్తుంది. తన సౌందర్యంతో అతన్ని సమ్మోహింపజేస్తుంది. అతన్ని మోసగించి అడవిలోకి తీసుకుపోతుంది. అక్కడ అతడు వాళ్ళ మంత్రాలకు లోబడిపోతాడు. అతడుకూడా వాళ్ళతో నాట్యం చేస్తాడు; హెల్లోయ్ కన్యలతో త్రాగుతాడు; అతడు ప్రపంచ మానవులందరికంటెను సుఖిస్తున్నాడు. కాని, పాపం, ఆ దేవకన్యల లోకపు ఆనంద లను చవిచూచిన పిమ్మట, సామాన్య మానవసంఘానికి అతడు మరలి రాలేడు.

లైపౌ చోంగ్బా నృత్యంలో ప్రపంచంయొక్కయు, మానవులయొక్కయు సృష్టిగాథ మరొకటి ప్రదర్శించబడుతుంది. శరదృతువు చివరి రోజులలో 'అశ్విన్' నెలలో,

17. పై చిత్రం : లెప్చాల యుద్ధ నృత్యం
18. క్రింది చిత్రం : లెప్చా నృత్యం; డార్జిలింగ్





19. పైచిత్రం : ఖడ్గ నృత్యం. కులు; హిమాచల్ ప్రదేశ్
20. క్రింది చిత్రం : గద్దీనృత్యం; హిమాచల్ ప్రదేశ్





21. పై చిత్రం : పంగీ నృత్యం; హిమాచల్ ప్రదేశ్
22. క్రింది చిత్రం : బూరా నృత్యం; హిమాచల్ ప్రదేశ్





23. పై చిత్రం : కశ్రీ నృత్యం; కాశ్మీర్

24. క్రింది చిత్రం : డోగ్రా నృత్యం; జమ్మూ. కాశ్మీర్



దేవతలకు దేవుళ్ళకు నతు లర్పించటంకోసం, సంవత్సరాని కొక పర్యాయం ఈ నృత్యం చేస్తారు. లైహారోబా నృత్యంలో వలెనే, ఈ నృత్యంలోకూడా, మెయ్‌బిస్ (పురోహితురాలు) ఆవాహన మంత్రాలు చదువుతుంది. ఆమె భక్తికి దేవతలు మెచ్చి, వారి చేలకు కావలసిన వర్షాన్ని పుష్కలంగా ప్రసాదిస్తారు.

ముఖోరిలాం అనే మరొకనృత్యంకూడా ప్రజామూలక మైనదే. భగవంతుడు, తాను సృష్టించిన ఈ విశ్వాన్ని చూచి, సంతోషపడి, భూమికి దిగివస్తాడు; మాతృదేవితో ఆనందపరవశుడై నృత్యం చేస్తాడు.

అలాంటి మరొక నృత్యమే 'పుంసాకదింలం'. దీనిలో నర్తకులు పాట పాడుతూ, వీడ్కోలు నృత్యం చేస్తారు. పాట ఈ తీరుగా నడుస్తుంది: "ఓ మహా ఆతిథేయా! మాకు ఫలాహారములను సిద్ధపరచుము; మేము బడలి ఉన్నాము; వెళ్లేముందు నీ ఆరోగ్యం నిమిత్తం నీతో విందారగిస్తాము."

మణిపూర్ నాగజాతివారు అనేకనృత్యాలు చేస్తారు. ఇవి, కథావస్తువులోనూ, రీతిలోనూ చాలా విస్తారమైన వైవిధ్యం కలవి. మోనాగుల నృత్యాలకు దైవామంత్రణము కథా వస్తువుగా ఉండి, ఆ కథా వస్తువుచుట్టు నృత్యాలు పరిభ్రమిస్తాయి. మోవో (ఆవాహనము), ఉతానఘు (భూమాతను పిలుచుట), ఉరిదోహ్హా (గిరిజనుల యుద్ధము), పినలోదోహ్హా (ఉత్సవగీతం), పివోనఘు (జానపద గీతం) దీనిలోనివి.

దీనిలో మొదటిది, దేవునీ, దేవతలను ఆవాహనము చేసి, తమ జాతికి దీర్ఘాయుష్యము, సంపదలూ కోరుతుంది. రెండవది కష్టజీవుల జీవితాన్ని ప్రశంసిస్తూ, సమృద్ధిగా పంటలు ప్రసాదించవలసిందని భూమాతను ప్రబోధిస్తుంది. యుద్ధాన్ని తలలు నరకటాన్ని ప్రస్తుతించటం, నాగుల యుద్ధరీతిని ప్రదర్శించటం,- ఇవి ఉరిదోహ్ నృత్యానికి సమర వాతావరణాన్ని కల్పిస్తున్నాయి. నాగులు తమ పూర్వీకుల నుండి అభ్యసించిన జీవితవినోద భావాన్ని పినలో దోహ్ నృత్యం ప్రదర్శిస్తుంది.

## ఫై చ క్:

ఫైచక్ నృత్యం ఉల్లాసనృత్యం; మణిపూర్‌లోని టంగ్‌ఖుల్ నాగప్రజలు ఈ నృత్యం చేస్తారు; సంతోష పారవశ్యంతో నిండి ఉంటుంది. ఈ నృత్యం, సర్వసాధార ణంగా పంట కోతల కాలంలో చేస్తారు

ఈ నృత్యంలో, నర్తకులు, 'పంటలరాణిని' ప్రార్థించినపిమ్మట, కరచరణాలను, శరీరాన్ని వివిధరీతుల సంచలింప జేయటం ద్వారా తమ పారవశ్యాన్ని వ్యక్తం చేస్తారు. దీనిలో స్త్రీపురుషు లుభయులు పాల్గొంటారు.

## పౌన్‌సాలం (సుడిగాలి) :

మణిపూరు కొండలలో నివసించే, దృఢగాత్రులైన కబ్యూయిజాతి చేసే నృత్యాలలో పౌన్‌సాలం ఒకటి. సుడి గాలియొక్క వేగాన్ని, మహావేగంతో తిరుగుతున్న రథ చక్రాలను అనుకరిస్తూ చేసే శరీర సంచలనం ఈ నృత్యం

లోని ప్రత్యేక లక్షణం, సాధారణంగా, జనవరి నెలలో వచ్చే. వారి సాలుసరి పండుగల కాలంలో దీనిని చేస్తారు. ఈ నృత్యం, ఎక్కువగా, సామూహిక నృత్య పద్ధతిని పోలి ఉంటుంది.

పల్లె డోల్ మ్రోగగానే, యువతీ యువకులు, రంగు రంగుల దుస్తులు వేసుకొని, రెండు వరుసలలో నిలుస్తారు; ఆ పిమ్మట గుండ్రంగా తిరుగ నారంభిస్తారు; నృత్యం కొన సాగే కొలది వేగం హెచ్చుతుంది; అందరూ కలసి పాడు తారు కూడాను.

## టండన్ ఫెయ్ బోక్ (మిణుగురు గెలుపు):

దేవుళ్ళను, దేవతలను ప్రసన్నులను చేయటానికి, టండన్ ఫెయ్ బోక్ నృత్యం సాంవత్సరికోత్సవాల సందర్భంలో జరుపు తారు. గాయకులు పాడుతూ ఉండగా, ఆ లయకు అనుగు ణంగా, దంపతుల జతలు, చేయి చేయి పట్టుకొని, ఊరేగ టంతో ఈ నృత్యం ఆరంభ మవుతుంది. ఆ తరువాత, నర్తకుల బృందం, రెండుజంటలతో కూడిన చిన్నవర్గాలుగా చీలిపోయి, వలయాకారంగా నృత్యం చేస్తారు.

అస్సాం ప్రాంతంలోని నాగుల నృత్యాలలో వలెనే, మణిపూరు నాగుల నృత్యాలలోకూడా పాదగతులు అంత వేగంగానూ, అంత లయాన్వితంగానూ ఉంటాయి. జానపద నృత్యాలలో, నడుమును, తలను, నెమ్మదిగా ఎగురవేయటం స్వభావసిద్ధంగా ఉంటాయి. మణిపూరు, అస్సాం నృత్యా లలో, కొన్నిటిలో కన్పించే సమాన కాలగతులతో కూడిన రీతులు అత్యంత సంకీర్ణాలు; భారతదేశంలో మరెక్కడా

కన్పించవు. రంగస్థల రీతులతో, మానవరూపంతో, ఈ రెండింటితోనూకూడా సర్వసాధారణంగా నిర్మాణమయ్యే రీతులు, వర్తులాకారాలు, అర్ధవర్తులాకారాలు, అష్టసంఖ్యాకారమున్నా. ఈ నాగులవేషాలు, అస్సాం ప్రాంతంలోని నాగుల వేషాలను పోలి ఉంటాయి. శిరోవేష్టనము, పూసల ఆభరణాలు, ఈ ఆహార్యంలోని ప్రత్యేక లక్షణాలు. గ్రామీణ నర్తకులు జానపద నృత్యాలు చేసేటప్పుడు ధరించే దుస్తులలో ముఖ్యమైనవి - పెనాక్ అని పిలువబడే జీరాడే పరికిణీ, బిగువైన కంచుకము, దానిమీద, కదిలే తెల్లని మేలిముసుగు. పైహారోబా, థబల్ ఛోంబీ నృత్యాలు ఈ వేషంతోనే చేస్తారు. మణిపూరులో సామాన్య పౌరులు కూడా ఇవే దుస్తులు ధరిస్తారు. రాస నృత్యాలకు దుస్తులు చాలా విస్తారంగా ఉంటాయి. లాస్యపద్ధతికిదే సరియైన వేష మని విశ్వసించబడుతున్నది. ఈ వేషాన్ని, మహారాజా జయసింగ్ తన స్వప్నంలో చూచాడని అంటారు. దీనిలో రెండు లంగాలుంటాయి - ఒకటి పొడవుగా బిరుసుగా ఉంటుంది, రెండవది కురచగా వుండి మోకాళ్ళవరకు వస్తుంది. గోపికల పాత్రలు, సఖుల పాత్రలు, ఈ దుస్తులు ధరిస్తారు. కృష్ణభగవానుని పాత్రను నటించే వ్యక్తిమాత్రం మామూలు పద్ధతిగా ధోవతి ధరిస్తాడు.

మణిపూరు నృత్యాల కన్నిటికీ వాయించే సంగీత వాద్యాలలో పంగ్ (డోలు), కర్తాళ్ (తాళాలు), పెనా అనబడే చిన్న తంత్రీవాద్యం (దీనిని విల్లువంటి దానితో వాయిస్తూ పాట పాడుతారు)ఉంటాయి. నాగుల నృత్యాలలో

మాత్రమే ఈ వాద్యాల నుపయోగించరు. వీనిబదులు పెద్దపెద్ద, అనాదికాలపు డోళ్ళను వాయిస్తారు; నర్తకులు స్వయంగా చేసే శబ్దాలే గాత్ర సంగీతం.

## ఈశాన్య సరిహద్దు ప్రాంతము :

ఈ ప్రాంతమునందలి అడవినాగులు ప్రాచీనకాలపు వీరజాతులకు చెందినవారు; ఆ ప్రాంతపు స్థానిక సంస్కృతిని నేటికిసీ భద్రపరచి ఉంచారు.

### యాక్ నృత్యం :

ఈ ప్రాంతపు ప్రజల జవసత్త్వాలకు అనురూపంగా ఉండే నృత్యం యాక్ నృత్యం. ఒక ప్రాచీనగాథ దీనికి బీజం. ఓక మనిషి తండ్రిచేత ఇంటినుండి వెళ్ళగొట్టబడటం, చిట్ట చివరకు ఒక జడలబర్రె (యాక్) అతని కెదురుపడటం వంటి అసాధారణ అనుభవాలను ఈ నృత్యం ప్రదర్శిస్తుంది. ఆ రోజు లగాయతు, ఆ గాధప్రకారం, జడలబర్రె తన సంతతిని అభివృద్ధి పరచుకొంటూ ఉంది; జడలబర్రె ఆ ప్రాంతపు ప్రజా జీవితంలో ప్రముఖ భాగంగా ఉంది.

### దుప్పి నృత్యం :

దుప్పులు, గొర్రెలు, పశులవంటి జంతువులయెడ దయాళుత్వము, వాటిని వధింపరాదనే ప్రాచీనాచారమూ, ఈ వేట నృత్యానికి ప్రధాన కథా వస్తువుగా రూపొందినవి. వేట అంటే మక్కువ గల ఒక ముసలి గొర్రెలకాపరి, అతని ఇద్దరు కుమారులూ, ఒక దుప్పిని వలపన్ని పట్టి ఇంటికి తీసుకురావటం ఈ నృత్యంలోని ప్రధాన కథావస్తువు.

ఆ దుప్పిని వారు చంపబోతూ ఉండగా, గ్రామస్థులు కరుణా ప్రేరితులై అక్కడకు చేరుతారు; దానిని చంపవద్దనీ, వదలి పెట్ట వలసిందనీ వారిని అర్థిస్తారు.

ఈ ప్రాంతానికి చెందిన నాగజాతి, అతి ప్రాచీనమైన, బలిష్ఠులైన గిరిజన జాతులలో ఒకటి. వీరు నవ్యభారత భావ ప్రేరితులై ఇప్పుడు తమ శక్తి సామర్థ్యాలను నిర్మాణాత్మక మైన రంగాలవైపు మళ్ళిస్తున్నారు; తమ ప్రాచీన సంస్కృతిని, నృత్యగానాలను పదిలపరచుకొంటున్నారు. నాగ జాతులలో అనేక తెగలవారు బర్మా సరిహద్దున కొండలతో దట్టమైన అడవులతో నిండి ఉన్న ప్రదేశాలలో నార్త్-ఈస్టు ఫ్రాంటియర్ ప్రాంతాలలో నివసిస్తున్నారు.

వెనుకటి రోజులలో యుద్ధానికి తలలునరికే దాడులకు ఆయత్త మయ్యేటప్పుడు తరచు నాగనృత్యం చేయబడుతూ ఉండేది. ఇది సమూహానృత్యం; సంఘీభావాన్ని ద్యోతకం చేస్తుంది. ఈ నృత్యమంతా వీర్యవంతంగా శక్తిసంభరితంగా ఉంటుంది. దృఢగాత్రులు ఆత్మ విశ్వాసపూర్ణులైన నాగులకు ఈ గుణాలు ఉగ్రరూపాలతో అలవడుతాయి. అద్భుతమైన చరణచాలనం ఈ నృత్యంలోని ప్రత్యేక లక్షణం; దీనిలో నర్తకుల శిరోవేష్టనములోని రంగు రంగుల పిట్ట ఈకలు సైతము సమరోత్సాహాన్ని ప్రేరేపిస్తున్న ట్లుంటాయి.

## సంగ్తం నృత్యం:

సంగ్తం నాగజాతివారు చేసే నృత్యాలలో సర్వ సాధారణంగా మూడురకాలుంటాయి. వాటిపేర్లు: నెరి చుంగ్టి, సంగ్ఫా, ఖయక్ సుట్సుక్.

నెరిచుంగ్ట్ నృత్యం సాధారణంగా గ్రామంలోని మేటి బలశాలి గౌరవార్థం చేస్తారు. నృత్యానంతరం విందు జరుగుతుంది. పులులవేటకు బయలుదేరేముందు సంగతం నాగులు చేసే పనులను సంగతంనృత్యం ప్రదర్శిస్తుంది. అన్నివేళల జాగృతులై ఉండటానికి గ్రామస్థులేమి చెయ్యాలనేది దీనిలోని కథావస్తువు. గ్రామాన్ని దాడిచేసేముందు చేసే పనులను ఖయక్ సుట్‌సుక్ చిత్రిస్తుంది. ఈ కారణంచేతనే వీనిలో గానం ఉండదు. నర్తకులు, సుశిక్షిత పద్ధతిలో తమ పాదాలను ప్రక్కలకు జరుపుతారు. గ్రామంచుట్టు,రక్షణకోరకు నాటబడే వెదురుమేకులను దాడికి తాము సిద్ధపడేముందు తొలగించి వేయటాన్ని ఇది సూచిస్తుంది.

## డార్జిలింగ్ :

హిమాలయ ప్రాంతాలయిన డార్జిలింగ్, భూటాన్ సిక్కింలలో బహువిధమైన జానపద నృత్యాలు కన్పిస్తాయి. వీనిపై బౌద్ధలామాల సంప్రదాయ ప్రభావం విశేషంగా ఉంది. అందుచేత, ఈ ప్రాంతంలో ఆచారకర్మలకు సంబంధించిన కృత్రిమ ముఖాల నృత్యాలుగానీ లేక రాజులను గురించిన పాటలతో కూడిన పిరికితనపు తరహా నృత్యాలుగానీ చాలా రకాలు కనిపిస్తాయి. ఈ ప్రాంతంలో బాగా పేరుపొందిన నృత్యాలలో లేపాచ్ నృత్యం ఒకటి. దీనిలో స్త్రీ పురుషు లుభయులూ పాల్గొంటారు. ఈ నృత్యం నిదానపు కదలికతో ఆరంభమై పోను పోను చలనరీతి మరింత దృఢతర మవుతుంది.

ఇక లామాల పురాతన సంప్రదాయ నృత్యం ఉంది. బౌద్ధారామాలలో జరిగే మహోత్సవాలలో నృత్యం తప్పకుండా ఉంటుంది. 'మంచి చిట్టచివరకు చెడును జయిస్తుంది. మంచిపనులుచేసేవారికి మాత్రమే శాంతి, సౌఖ్యాలు దక్కుతా'యనే నీతిచుట్టూ, ఈ నృత్యాలలోని కథావస్తువు అల్లుకొని ఉంటుంది.

ఈ నృత్యంలో లామాలు, రంగు రంగుల దుస్తులు ధరించి దేవతల, రాక్షసుల వేషాలు వేస్తారు. సర్వసాధారణంగా ప్రదర్శనానికి ముందు, లామాలు కనీసం ఒక పక్షం రోజులపాటు ధ్యానంలో ఉంటారు.

సిక్కిం నృత్యాలలో కొన్ని స్వభావతః చాల సున్నితంగా మరులుగొల్పుతూ ఉంటాయి. సిక్కింలోని తమాంగులు దీనిలో ఒక నృత్యం చేస్తారు. నర్తకులు అందరు తమ తలలమీద మువ్వలులేని 'డంఫు' (కంజీరా)లు పట్టుకొని అందాలు ఒలకబోస్తూ చక్రగతులలో తిరుగుతారు. తిరుగుతూ నర్తకులు (కంజీరా) 'డంఫు' వాయిస్తూ పాడుతారు. ఈ సుప్రసిద్ధ నృత్యానికి డోళ్ళచప్పుళ్ళు వాద్య మేళాన్ని చేకూరుస్తాయి.

షాప్ థో నృత్యం, సిక్కిం జానపద నృత్యాలలో చాలా ప్రసిద్ధమైనదీ, విశేష ప్రచారం కలదీన్నీ. షాప్ థో అనే మాటకు అర్థం పాదగతి. ఈ నృత్యంలో నర్తకులు పాదాలతో తాళంవేస్తూ, జానపద గేయాలు పాడుతూ వర్తులాకారంగా తిరుగుతారు. పురుషులు, స్త్రీలు వేర్వేరు వలయాలుగా ఏర్పడుతారు. పాటపాడే టప్పుడు, ఒకప్పుడు

స్త్రీలు, మరొకప్పుడు పురుషులు పల్లవి అందుకొంటూ సంవాద రూపంలో పాడుతారు. నృత్యగమనం నెమ్మదిగా ఆరంభమై క్రమక్రమముగా వేగం హెచ్చి, కట్టకడకు తీవ్ర వేగంతో ముగుస్తుంది.

షాప్ థోహ్ యొక్క విశేష ప్రచారానికి కారణం సామూహిక వినోదానికి అనుకూలమైన దానిరూపమే. పైరు పచ్చల పల్లెలో తొలకరి నృత్యం గానూ, సాంఘిక కార్య కలాపాలలో ఉల్లాసం పుట్టించేది గానూ, లేక. చలికాలంలో సాయంవేళ నెగడిచుట్టూ చేసేదిగానూ, ఈ నృత్యం, సిక్కిం జానపద నృత్యాలలోకెల్ల అత్యంత విలక్షణంగా ప్రీతి పాత్రంగా నేటికీ నిలచి ఉన్నది.

## హిమాచల్ ప్రదేశ్ :

ఉత్తర ప్రాంతాలయిన హిమాచల్ ప్రదేశ్, కుమాన్ కొండల ప్రాంతాలకు చేరేసరికి, కొండజాతుల స్వరూప స్వభావాలలోనూ, జానపద నృత్యాలలోనూ కూడా చాలా మార్పు కన్పిస్తుంది. ఈ ప్రాంతాలలో మనకు వేరు రకమైన నృత్యాలు కన్పిస్తాయి. ఒకవైపు మణిపూరు, అస్సాం ప్రాంతాలకూ; మరొకవంక హిమాచల్ ప్రదేశ్, కుమాన్ ప్రాంతాలకు మధ్యనున్న శీతోష్ణపరిస్థితుల తారతమ్యాల ప్రత్యక్షఫలిత మీమార్పు. స్థూలంగా చూచినప్పుడు ఈ ప్రాంతాలలో కూడా నృత్యాలను గిరిజన నృత్యాలు, గ్రామీణ సాంఘిక నృత్యాలు అని విభజించవచ్చును. రెండవ రకంలో మరల, మతప్రభావం స్పష్టంగా గోచరిస్తుంది. మణిపూరు, అస్సాం నృత్యాలకు శ్రీకృష్ణ. శివ

గాథలు ఇతివృత్తాలుగా ఉన్నట్లే, ఈ ప్రాంతపు నృత్యాలకు రామకథలుగాని, లేక ఒక్కొక్కప్పుడు శ్రీకృష్ణగాథలుగాని ఇతివృత్తంగా ఉంటాయి.

దసరాఉత్సవాల సందర్భంలో బృందనృత్యం, హిమాచల్ ప్రదేశ్ అంతటా చాలా వ్యాప్తిలో ఉంది. ఈ ఋతువులో స్త్రీలు, పురుషులు, 10 రోజులు మొదలు 12 రోజుల వరకు కొనసాగే నృత్య పరంపరలో పాల్గొంటారు. 'రామలీల' పూర్తిగా ప్రదర్శిస్తూ, రోజు తర్వాత రోజు నృత్య పరంపర ప్రదర్శనలు జరుపుతారు.

దీపావళి ఉత్సవంలో, 'బురా' అనబడే నృత్యం చేస్తారు. దీనిలో స్త్రీపురుషు లుభయులు పాల్గొంటారు. దీపావళీ ఉత్సవభావం ఈ నృత్యంలోని ఆనందానికీ అందానికీ ప్రేరేపణ కల్గిస్తుంది. పురుషులు, స్త్రీలు, ఒకరిచేతు లొకరు పట్టుకోకుండానే తమ తమ స్థానాలలో నిలువబడి, కుడివైపునుండి ఎడమవైపుకు వలయగమనాన్ని అభివర్ణిస్తారు. ఇది ఆరంభంనుంచే వేగంగా సాగుతుంది. నర్తకుల కుడివైపున నిలువబడి ఉండే వాద్యగాండ్రు, ఆ తరువాత, నర్తక బృందంతో కలసి వర్తులాకారంగా ఏర్పడుతారు. ఈ నృత్యరీతిలోని ప్రత్యేకత, త్వరిత గతిని వేగాన్ని సంతరించుకోవటమే.

### రాసనృత్యం:

పేరు తెలియపరుస్తున్న విధంగా, రాస నృత్యంలోని ప్రధానరసం శృంగారం; పాటకు అనురూపంగా నృత్యం

సాగుతుంది. రాస నృత్యం ప్రత్యేకంగా, 'బిసుసంత' కాలంలోనూ, 'మాఘసంక్రాంతి' (ఫిబ్రవరి - మార్చి నెలమధ్య వస్తుంది) కాలంలోనూ చేస్తారు. ఒక్కొక్కప్పుడు, పాట, ఒకానొక చారిత్రిక సంఘటనను వర్ణించటం కూడా కద్దు.

ఈ రీతిగా, పురుషులు, స్త్రీలు, రంగురంగుల దుస్తులు ధరించి, ఒకరిచేయి ఒకరు పట్టుకొని మధ్యనున్న వాద్యగాళ్ళ చుట్టూ నృత్యం చేస్తారు. దంపతులు, ఒకరి తర్వాత ఒకరు, ఆనందంతో, వర్తులాకారంగా నృత్యం చేస్తారు.

## ఛత్రారి నృత్యం :

ఛంబాజిల్లాలోని ఛత్రారి అనే గ్రామం. ఈ నృత్యానికి పుట్టినిల్లు. ఆ ప్రదేశం, సంవత్సరంలో నాలుగు నెలలు మంచుకప్పి ఉంటుంది; అక్కడ నివసించే వారివృత్తి వ్యవసాయం; ఉపవృత్తిగా గొర్రెలను పెంచుతారు కూడాను. శీతాకాలంలో అక్కడి ప్రజలలో నూటికి అరవైమంది ఉష్ణ ప్రాంతాలకు వలసవెళ్తారు.

వారు చేసే నృత్యం సాధారణంగా ఈ క్రింది మూడు భాగాల సమ్మేళనంగా ఉంటుంది:

1. దంగి :

'యాత్రల' సందర్భాలలోనూ, వివాహ సందర్భాలలోనూ, ఈ నృత్యాన్ని ప్రత్యేకంగా స్త్రీలే చేస్తారు; వాద్యగాళ్ళు వాద్యాలు వాయిస్తూ ఉంటారు. నర్తకులు వలయాకారంలో నిలిచి, రెండు పక్షాలుగా పాట పాడతారు. పాటపేరు 'గురేహి'. తక్కువ కులం పిల్లను ప్రేమించిన ఒకరాజుకూ, ఆ పిల్లకూ జరిగిన సంభాషణ

రూపంలో ఉంటుం దీపాట. రాజు చెప్పే మాటలను, నర్త కులలో ఒక పక్షంవారు పాడుతుంటారు; రెండవపక్షం పిల్ల తరఫున సమాధానం చెప్తుంటారు. మొదట నిదానంగా ఆరంభమయినా, ఈ నృత్యం చివరకు వచ్చేసరికి వేగాన్ని అందుకొంటుంది.

**దీపక్ :**

సర్వసాధారణంగా, అక్టోబరు –నవంబరు నెలలలో గద్దీలు, కాంగ్రాకొండ దిగువ ప్రాంతాలకు వలస వెళ్ళే కాలంలోనే ఈ నృత్యంకూడా చేస్తారు. వాద్యగాళ్ళు ఒకవైపు కూర్చుండగా నర్తకులు వలయాకారంగా ఏర్పడుతారు. 'ఛిన్ – జోతి' అనబడే పాట పాడు తారు. బ్రతుకు తెరువుకోసం కాంగ్రాకు వెళ్ళిన ప్రియుని విరహంతో క్రుమ్గిపోయే యువతి మనోభావాలను ఈపాట వర్ణిస్తుంది. త్వరగా తిరిగివస్తానని ఆమె అతనిచేత ప్రమాణం చేయిస్తుంది. నృత్యగమనం సత్వపూర్ణంగా ఉండి, కడపట నృత్యం పరాకాష్ఠ నందుకొంటుంది.

**ఝుంజర్:**

ఇది సత్త్వపూర్ణమైన నృత్యం; వర్షర్తువు అనంత రము అన్ని ఉత్సవకాలాలలోనూ దీనిని ప్రద ర్శిస్తారు; ఈ ప్రాంతంలో ఇది చాలా ప్రచారంలో ఉంది. ఈ నృత్యాన్ని అనుసరించి పాడేపాట పేరు 'ధరంగ్ సరన్.' పురుషులు, స్త్రీలు ఒకే కేంద్రంతో రెండు వలయాలుగా ఏర్పడుతారు. నృత్యంచేస్తూ రెండువర్గాలూ స్థానాలు మారుతూఉంటారు. ప్రారంభం లగాయతు, కరచరణ చాలనం వేగవంతమై, కట్టకడపటికి పరాకాష్ఠ నందుకొంటుంది.

ఇందులో ఉపయోగించబడే వాద్యాలు: సన్నాయి, డోలక్, ఇదుం, కాహల్, రన్‌సింగ, వేణువు.

గద్ది నృత్యానికి, చంబాజిల్లాలోని లాహౌల్, భార్మూర్ ప్రాంతాలు జన్మస్థానాలు. ఈ నృత్యం, ఒంటరిగాగానీ వర్గాలుగాగానీ చేస్తారు. ఈ ప్రాంతంలో ప్రచారంలో ఉన్న వాద్యాల సంగీతం తోడుగా ఒక్కొక్కప్పుడు 20 నుండి 30 మందివరకు పురుషులు, స్త్రీలు నృత్యం చేస్తారు. ఈ నృత్యం చేసేటప్పుడు పాడేపాటలు భక్తిగీతాలు; ఈ పాటలలో తాళగతులు ఆ యా సందర్భాలనుబట్టి మారుతుంటాయి. శివుడు ఈ ప్రాంతపు ప్రధానదైవం; శివపూజతో పాటు ఈ నృత్యం పుట్టిందంటారు.

**చంబా నృత్యం.**

ఈ నృత్యం చేసేవారిలో ఎక్కువమంది ఛురహ ప్రాంతీయులు; చంబా లోతట్టుకొండ ప్రాంతమునన్న ప్రముఖమైన ప్రదేశమిది. సన్నాయిలు, కర్నాలాలు వాయిస్తూ ఉంటే, స్త్రీలు పురుషులు కలిసి ఈ నృత్యాలు చేస్తారు. నర్తకులు, గొర్రెలకాపరులు మామూలుగా పాడేపాట పాడుతారు. ఈ పాటలో, గాజులబత్తులు, సమీపంలోని మరకతాల గనులకు విహారార్థం వెళ్ళేవారు ప్రధానపాత్ర వహిస్తారు.

కుథాన్‌లోని ఎగువ మహాసు తెగ గిరిజనులు బేథా నృత్యం చేస్తారు. మామూలుగా ఈ నృత్యాలు దసరా, దీపావళి సమయాలలో చేస్తారు; ఈ నృత్యాలు చేసేటప్పుడు పాడేపాటలో రామాయణగాథ ఉంటుంది. మొదట ఈ

నృత్యం నిదానంగానే ఆరంభమవుతుంది కాని, క్రమంగా వేగగతిని పొంది, దీపావళి నృత్యంతో అంతమవుతుంది.

**పాంగి నృత్యం :**

హిమాచల్ ప్రదేశ్‌లోని పాంగి, చంబాకు ఉత్తర దిశన ఉంది; సంవత్సరంలో సగంకాలం మంచు కప్పి ఉంటుంది. 'ఫ్రూల్‌యాత్ర'కు వెళ్ళే చలిరోజులలో, అచటి ప్రజలు ఈ సంతోష నృత్యప్రదర్శనంతో ప్రొద్దుపుచ్చుతారు. నర్తకులు మనోజ్ఞమైన వేషాలు ధరంచి, వలయాకారంగా నృత్యంచేస్తారు; వాద్యగాండ్రు మధ్య నిలువబడి గానాలాపన చేస్తుంటారు.

**భిని నృత్యం :**

మతసంబంధమైన సమావేశాలలోనూ, సాంఘిక సమావేశాలలోనూ, భినిప్రాంతపు పురుషులు, స్త్రీలు ఈ నృత్యం చేస్తారు. నృత్యారంభంలో, నర్తకులు, మనోహరమైన దుస్తులు ధరించి, చేతులు చేతులు పట్టుకొని వాద్యగాండ్ర చుట్టూ అర్థచంద్రాకారంగా నిలుస్తారు. పిమ్మట, మధ్య మధ్య ఆగుతూ వలయాకారంగా తిరుగుతారు. తుదికి నర్తకులు మోకాళ్ళు వంచగానే, గానం ఆగిపోతుంది; నృత్యం ఆగిపోతుంది.

**కొర్కుస్ నృత్యం :**

ఈ ప్రాంతంలోని నృత్యాలన్నిటిలోనూ పురుషులు, స్త్రీలు కూడా పాల్గొంటారు. ఈ నృత్యాలలోని ప్రత్యేక లక్షణము వృత్తగతులు. వీనిలో విశిష్టమైన ప్రవాహగుణం

వుంది. ఈ నృత్యాలు మోకాలి చలనాన్ని చాలా ఎక్కువగా ఉపయోగపరచుకొంటాయి; చటుక్కున క్రిందికి క్రుంగటం, కాళ్ళు కత్తెరలాగా పెట్టటం ఎక్కువగా కనిపిస్తుంది. ఈ నృత్యాలలో కొన్ని చూస్తూంటే అమరావతిశిల్పంలోని అలంకరణ శిల్పంలో మనకు కన్పించే వస్తులాకృతులు జ్ఞప్తికి రావటం ఆశ్చర్యకరం. ఈ నృత్యాలలో చాలా వాటిలో, ధరించే దుస్తులు; బిర్రుపైజమాలు, పొడవాటి ఉన్ని కోటులు నడుముకు కాంతిమంతమైన దట్టీలున్నూ. దట్టీలు అనేక వర్ణాలలో ఉంటాయి. నాయకుడు ప్రత్యేక రకమైన దట్టీ ధరిస్తాడు. తలమీద ఎక్కువగా తలపాగలే ధరిస్తారు; ఆ పాగలమీద ఆభరణాలు, పూసలు అలంకరించి ఉంటాయి. ఈనృత్యాలలో ఎక్కువ వాటికి గాత్ర సంగీతం తోడుగా ఉంటుంది; పురుషులు, స్త్రీలు వేరు వేరు జట్లుగా పాటపాడుతారు. సన్నాయి, కర్నాలా వాద్యాలతోపాటు, దుందుభి అనే పురాతనకాలపు వాద్యంవంటి వాద్యంకూడా వాయిస్తారు.

కుమౌన్ :

కుమౌన్ ప్రాంతపు నర్తకులు హిమాచల్ ప్రదేశ్ నర్తకులను పోలి ఉంటారు. ఉభయులకు, వాళ్ళ వాళ్ళ స్వభావసిద్ధమైన రూపురేఖలనుబట్టి సులభంగా వేరుపరచగలిగినప్పటికీని ఈ ఉభయప్రాంతాల నర్తకులలో పోలికలు చాలా కన్పిస్తాయి.

డెహ్రాడూన్, ఛక్రోటాలయందలి జౌన్సారులు, అనేక రకాల సాంఘిక ఉత్సవ నృత్యాలకు పేరుపొందారు.

## ఉత్తరప్రదేశం:

### బరాదినటి నృత్యం:

ఉత్తరప్రదేశంలోని డెహ్రాడూన్ జిల్లాలో, జౌన్‌సార్-బవార్ ప్రాంతంలో విశేష ప్రచారంలో ఉన్న నృత్యాలలో బరాదినటి నృత్యం ఒకటి. మతసంబంధమైన, సాంఘిక సంబంధమైన ఉత్సవాలలో ఈనృత్యం ప్రదర్శించబడుతుంది. ఈ నృత్యంలో పాల్గొనే యువతీ యువకులు నయనానంద కరంగా వేషాలు ధరించి, రెండు అర్ధచంద్రాకారాలుగా ఏర్పడి గిర్రు గిర్రున తిరుగుతారు. నృత్యానికి వంతగా, సంవాద రూపంలో స్థానిక ప్రేమగాథలను గానం చేస్తారు.

నృత్యం సాగుతూఉండగా, బాలికలు, పళ్ళేలను వ్రేళ్ళమీద త్రిప్పుతారు; లేదా, ఒక్కొక్కప్పుడు నీళ్ళు నింపిన బిందెలను తలక్రిందులుగా నెత్తిమీద పెట్టుకొంటారు. వాటిని ఎంత నేర్పుగా నిలుపుతారంటే - వాటినుండి ఒక్క చుక్క నీరుకూడా క్రిందికి జారదు.

తమ ప్రేమికులను లోబరచుకోవటానికి బాలికలు తమ తమ ప్రజ్ఞా విశేషాలను ప్రదర్శించటమే ఈ నృత్యం లోని ఇతి వృత్తం.

జోంహ్రా అనేది మరొక కుమాన్ నృత్యం. దీనిలో పురుషులు, స్త్రీలు, ఉభయులూ, అతిథులుకూడా పాల్గొం టారు. చేతులు చేతులు పట్టుకొని వలయాకారంగా, నిదానంగా, సామాన్యమైన అడుగులువేస్తూ వాళ్ళు నృత్యం



25. పై చిత్రం : ఛోరా నృత్యం, జౌన్సార్; ఉత్తర ప్రదేశ్

26. క్రింది చిత్రం : బరదినటి నృత్యం, జౌన్సార్ బవర్; ఉత్తరప్రదేశ్





27. పైచిత్రం : ధాలీ నృత్యం, గార్వాల్; ఉత్తరప్రదేశ్

28. క్రింది చిత్రం : వసంత నృత్యం, కుమౌన్ కొండలు; ఉత్తరప్రదేశ్



29. పైచిత్రం : గడ్డికోత నృత్యం, కుమౌన్ కొండలు; ఉత్తరప్రదేశ్

30. క్రింది చిత్రం : భిల్ నృత్యం, హమీర్‌పూర్: ఉత్తరప్రదేశ్





31. పై చిత్రం. జధుర్ నృత్యం, భూమిజాజాతి; ఒరిస్సా
32. క్రిందిచిత్రం, చౌనృత్యం; ఒరిస్సా



చేస్తారు. చాలామంది నర్తకులు కలసి జో[ప్రా]నృత్యం చేస్తారు. ఈ ప్రజాసమూహం అప్పుడప్పుడు నిలువబడుతూ, వంగుతూ, కూర్చుంటూ, కదులుతూ ఉంటే, ఈ నృత్యాలకు పూర్వ క్షేత్రంగా ఉన్న అపార హిమాలయ శ్రేణులు, తిరిగి సృష్టింపబడుతూ ఉన్న ట్లనిపిస్తుంది.

గార్వాల్, ఆల్మోరా కొండలు – ఈ రెండు – నృత్య సంపదలో ఒకదానికొకటి తీసిపోవు. భోటియాలు రంగ్ భంగ్ నృత్యం చేస్తారు. వీరు ఉత్తరప్రదేశ్ లోని కొండలజిల్లా లయిన గార్వాల్ లోనూ ఆల్మోరాలోనూ నివసిస్తున్నారు. వాళ్ళ మామూలు క్రతువులన్నీ 'రాంబన్' అని పిలువబడే గ్రామచావడిదగ్గర జరుగుతాయి. వాళ్ళక్కడ సమావిష్టు లైనప్పుడు– పాడతారు, ఆడతారు; త్రాగుతారు. ఈ మనో హరమైన నృత్యాన్ని గార్వాల్ జిల్లాలో భోటియా నృత్యం అని పిలుస్తారు.

## చౌఫల కేదార నృత్యం:

చౌఫల కేదారనృత్యం భక్తినృత్యం. టెహ్రీగార్వాల్ గిరిజనులలో ఈ నృత్యం ఎక్కువ ప్రచారంలోఉంది. వీరు కేదార్ నాథ్ ఆలయ పరిసరాలలో నివసిస్తున్నారు. ఆలయం శీతకాలం తర్వాత తెరువబడినప్పుడు సాధారణంగా ఆలయం ముందు ఈ నృత్యం చేస్తారు.

శాంతిని, సంపదలను ప్రసాదించవలసినదిగా భగవం తుని వేడుతూ ఈ నృత్యం ఆరంభమవుతుంది. అటు తర్వాత ఏ భూదేవియొక్క బంగారు నేలనైతే తాము దున్నుతున్నారో ఆ దేవిచుట్టు నృత్యం అల్లుకొంటుంది. చిట్టచివరి భాగంలో

భగవానుడు వారిని ఆశీర్వదించటంతో నృత్యం పరాకాష్ఠను చేరుతుంది.

గార్వాలీ దుస్తులు ధరించి పురుషులుమాత్రమే ఈ నృత్యంలో పాల్గొంటారు. గార్వాలీ వాద్యాలయిన-డోళ్ళు, శంఖాలు, తప్పెటలు - ఈ నృత్యంలో వాయిస్తారు.

## పాండవ నృత్యం:

పేరు సూచిస్తున్నట్లుగా, పాండవ నృత్యానికి మహాభారత కథలు- ఇతి వృత్తాలుగా ఉంటాయి. హిమాలయ సానువులలో నివసించే ప్రజలలో ఈ నృత్యం వ్యాప్తిలో ఉంది. వీర శౌర్యాలను వర్ణించే 'వీరరాస' ఈ నృత్యంలోని ప్రధాన లక్షణము. నర్తకులందరు విళ్ళు, అంబులు, గదలు పట్టుకొంటారు. తక్కిన పురుష నర్తకులతోపాటు ద్రౌపది పాత్రధారిణియైన ఒక్క స్త్రీమాత్రం సాధారణంగా ఈ నృత్యంలో పాల్గొంటుంది. ఇందువలన నృత్య గతులలో ఆహ్లాదకరమైన విభిన్నత గోచరిస్తుంది.

ఈ ప్రాంతంలోని మరొక సుప్రసిద్ధ నృత్యం ఛపేల్లీ నృత్యం, ఈ నృత్యాన్ని దంపతులు ప్రదర్శిస్తారు. స్త్రీ చేతితో అద్దం పట్టుకొంటుంది; పురుషుడు రంగు రంగుల చేతిరుమాలు పట్టుకొంటాడు.

జగర్ అనే నృత్యం, పూనకాలకు, దయ్యాలకు సంబంధించిన నృత్యం కావటంచేత ఈ నృత్యాన్ని చేయటానికి కొందరు మాత్రమే అర్హులు. అంటు జాడ్యాలనుండి మరి ఇతర కష్టాలనుండి గ్రామాన్ని విముక్తం చేసేశక్తి ఈ నృత్యానికి కలదని అంటారు.

కుమాన్ ప్రాంత నర్తకుల వేషాలు, గార్వాల్ ప్రాంతపు నర్తకుల వేషాలు కూడా హిమాచల్ ప్రదేశ నర్తకుల వేషాలను పోలి ఉంటాయి. హిమాచల ప్రదేశ నర్తకుల వేషంలో ప్రత్యేకంగా కనిపించే పొడవాటి కోటు మాత్రం వీరి వేషంలో కనిపించదు దానికి బదులు వీరు కురుచ జుబ్బా వేసుకొంటారు. ఇచటి స్త్రీలు హిమాచల్ ప్రదేశంలోవలె బిగుతైన పరాయీలను వేసుకోరు; వానికి బదులు ఘాగ్రాలనబడే పరికిణీలు, పొడవాటి రవికెలు ధరిస్తారు; తలలకు తప్పకుండా నల్లటి చౌకాలు కట్టుకొంటారు; తలమీద మెడలో అందమైన వెండినగలు, రజితాభరణాలు ధరిస్తారు. ముక్కుపోగులు ఈ ప్రాంత ప్రజల మరొక ప్రత్యేకత.

## పంజాబ్:

హిమాచల్ ప్రదేశ్ కుమాన్లతో పాటు హిమాలయపు కొండలను పంజాబ్ పంచుకొన్నది. హిమాచల్ ప్రదేశ ప్రాంతంలో ఉన్నవని చెప్పబడిన కొన్ని నృత్యాలు పంజాబు కొండల ప్రాంతంలోకూడా ఉన్నాయి. కుమాన్ ప్రాంతపు నృత్యాలలోనూ, హిమాచల్ ప్రదేశ్ నృత్యాలలోనూ కన్పించే అద్భుత ప్రవాహగుణమే పంజాబ్ బృంద నృత్యాలలోకూడా మనకు కన్పిస్తుంది. ఈ సాంఘిక నృత్యాలు దసరా ఉత్సవాలలోకూడా ఉచ్ఛస్థితి నందుకోవటం కన్పిస్తుంది. భగవానుడైన రామచంద్ర ప్రభువు, ఆయన సోదరుడు లక్ష్మణుడు, రావణునితో చేసిన మహాసంగ్రామములను ఈ నృత్యాలలో ప్రదర్శిస్తారు.

అటుతర్వాత ప్రజలను సమావేశం కావలసిందిగా పిలిచినట్లు, తాామనరసింహుడు స్వర్గలోకవాసులను పిలుస్తాడు; పిలుస్తూ ఆ సంకేత దైవము నృత్యంచేస్తూఉంటే పురుషులు, స్త్రీలు, చేతులు చేతులు లంకెలు వేసుకొని వలయాకారంగా ఊగుతూ స్ఫృహతప్పేటంతవరకు వేగం హెచ్చేదాకా నృత్యం చేస్తారు.

కులూ లోయ నృత్యాలు అచటి ప్రజల భావాలను మూడింటిని – భక్తి, వీర, శృంగారములను–ప్రతిబింబిస్తాయి, ప్రదర్శింపబడే నృత్యంలో నటబృందం వివిధ సంగీత వాద్యములతో ప్రవేశిస్తుంది. తప్పెటల కోలాహలం, కత్తుల రాపిళ్ళతో నృత్యవేగం పెరుగుతుంది. ద్వితీయఘట్టంలో ఖడ్గాలను వదలివేస్తారు; ప్రశాంతమైన లయతో నృత్యం సాగుతుంది. తృతీయఘట్టంలో గానలయ కనుగుణంగా నర్తకులు తమ శరీరపు కండరా లన్నిటిని చలింప చేస్తారు. నాల్గవ ఘట్టంలో నర్తకులు ఖడ్గాలను తీసికొని వీరనృత్యం ఆరంభిస్తారు. నృత్య పర్యవసానదశ ఐదవఘట్టం. దీనిలో నర్తకులు మరల వలయాకారంగా ఏర్పడగా డోళ్ళు వాయించేవారు వారిమధ్య లేచి నిలుస్తారు. ప్రశాంతంగా లయకు అనుగుణంగా నెమ్మదియైన గతులతో, నర్తకులు, డోలు వాయిద్యగాళ్ళు నృత్యం చేస్తారు.

పంజాబులోని ఇతర నర్తకులు, ఎక్కువగా కొండల ప్రాంతాలవారు కాదు కాని ఎక్కువభాగం పంజాబుయొక్క సారవంతమైన భూములకు మైదానాలకు చెందినవారు. పంజాబు జానపద నృత్యాలలో అత్యంత ప్రజాదరణపొందిన

నృత్యం భాంగ్రానృత్యం. స్వయంసిద్ధమైన ఉల్లాస స్వభావం గల ఈ నృత్యం అన్ని పండుగల సందర్భాలలోనూ ప్రీతి పాత్రంగా ఉంటున్నది. భాంగ్రానృత్యం సరళమైన సమాజ నృత్యం. ఈనృత్యంలో ఎవరైనా ఏ సమయంలోనైనాపాల్గొన వచ్చును. గోధుమ విత్తనాలు చల్లడంతో భంగ్రానృత్య ఋతువు ఆరంభమవుతుంది. అప్పుడు భాంగ్రా భేరి మ్రోగ గానే, పూర్ణచంద్రుని వెన్నెలలో ఏదో ఒక విశాలమైదా నంలో గ్రామంలోని యువకులు చేరుతారు. నర్తకులు వలయా కారంగా నృత్యం చేస్తుంటారు. అయితే నృత్యం జరుగు తున్నప్పుడు ఎంతమందిబడితే అంతమంది నృత్యానికి అడ్డు రాకుండా చేరటానికి వీలుగా ఆ వలయం ఏర్పడుతుంది. ఢోలు వాద్యగాడు, ఢోలు మెడకు తగిలించుకొని అప్పు డప్పుడు గమనవేగాన్ని పెంచవలసింగా నర్తకులకు సంజ్ఞ చేస్తూ వలయం మధ్య నిలచిఉంటాడు. ఢోలు వాద్యగాని వెనుక ఇద్దరు లేక ముగ్గురు వ్యక్తులు నిలచి నృత్యాన్ని నడుపుతూ ఉంటారు; వీరు నృత్యం వృత్తిగాగలవారుకారు. సమాజంలోని సామాన్య సభ్యులలోనివారే. అయితే ఇతర సభ్యులకంటే సులభంగా అభినయం చేయగలరు. భాంగ్రాలో శాస్త్ర నిబంధనలేవీ లేవు. నృత్యం మామూ లుగా సాగిపోతూ ఉంటుంది. నర్తకులు అడుగులువేస్తూ చేతులు చరుస్తూ, కర్రలు ఆడిస్తూ, నృత్యంలోని ఆనంద పారవశ్యాన్ని ఉద్వేజితం చేయటానికి 'హోయ్, హోయ్; అప్ అప్' అని అరుస్తూ గిరున తిరుగుతూ ఉంటారు.

నృత్యం మధ్యమధ్యఆపి ధోల్లా లేక బోలీ (పంజాబు

సంప్రదాయ జానపదగేయం) పాడుతారు. అటు తరువాత మరల నృత్య మారంభిస్తారు.

నృత్యం చేయటానికి నర్తకులు సొగసైన దుస్తులు వేసుకొంటారు. నిండురంగుగల పట్టుపట్కా (శిరోవేష్టనము) లచ్ఛా (అనురూప వర్ణంగల కటివస్త్రం లేక చుట్టుగుడ్డ), పొడవాటి తెల్లని పంజాబీ కుర్తా, తళతళ మెరిసే తెల్లని గుండీలు పొదిగిన నల్లటి చంకకోటు, ఈ వేషాన్ని పరిపూర్తి చేస్తాయి. వీనికితోడు చీలమండలమీద ఘుంఘ్రూలు ధరిస్తారు.

గోధుమ విత్తటంతో ప్రారంభమయ్యే భాంగ్రా ఋతువులో, ప్రతి పౌర్ణమిరోజున గ్రామంలోని యువకులు ఏదో ఒక ఖాళీ పొలంలో చేరి డోళ్ళు మ్రోగుతుండగా, అలసేవరకూ నృత్యం చేస్తూ పాటలు పాడుతారు. బైశాఖి-కోతపండుగతో భాంగ్రాఋతువు అంతమవుతుంది; అప్పటికి, పసిడిగోధుమపైరుకోయటం, గాదులు నిండటం జరుగుతుంది.

యథార్థానికి భాంగ్రాను పంజాబు పురుషులు చేసే జాతీయ సామాజిక నృత్య మని పిలువవచ్చును. పంజాబీ స్త్రీలు చేసే గిద్ధనృత్యంకూడా ఇటువంటిదే. ఇది పాత కాలపు వలయనృత్యం. దీనిలోని అనుసరణ, గానం చెవుల కెంత ఇంపుగా ఉంటుందో దీనిలోని సరళ సుందరగతులు అంత నేత్రపర్వంగా ఉంటాయి. ఒక గీతంలోని ఈ దిగువ చరణాలు స్త్రీల జీవితాలలో దీని ప్రాముఖ్యాన్ని సూచిస్తున్నాయి :

“ ప్రవేశింపుము మా గ్రామముకూడా
ఓ గిద్ధనృత్యమా, ఓహో
పోకుమా ఆవలకు ప్రక్కదారినపడి.”

ఝుమర్ :

పంజాబురైతుకు ఏసమయమైనా ఝుమర్ సమయమే. అన్ని పబ్బాలలోనూ తప్పనిసరి అంశముగా ఉండేటంతగా ఝుమర్ నృత్యం పంజాబ్ గ్రామీణ జీవితంలో పడుగు పేక లుగా అల్లుకొని ఉన్నది. ప్రత్యేకంగా పురుషులుమాత్రమే చేసే ఈ నృత్యంలో మూడు తరాలవారు– తండ్రి, కొడుకు, మనుమడు – కలసి నృత్యం చెయ్యటం తరచు కన్పిస్తుంది. దీనిలో కన్పించే ఉత్సాహమూ, దృఢత్వమూ పంజాబుకు అనుగుణమైనవి.

నాయకుడు ‘బోలీ’ చెప్పి ఢోలువాద్యగాళ్లు రంగం మీదికి దూకటంతో ఈ నృత్యం ఆరంభమవుతుంది. ఢోలు ధ్వనికి అనుగుణంగా గడియారంవలె తిరిగే వీరి గతులు జంతువుల నడకలను సూచిస్తాయి. అటుపిమ్మట వీరు తమ నిత్య జీవితంలోని దృశ్యాలను అభినయిస్తారు. ఈ నృత్యం ఆరంభంలో వేగం తక్కువగా ఉన్నా క్రమంగా పెరిగి ఉద్రిక్త పరాకాష్ఠను చేరుతుంది. అప్పుడు ఉద్రిక్తులైన నర్తకులు జతలు జతలుగా చీలిపోయి వివిధ భంగిమముల తోనూ, విన్యాసాలతోనూ, చతురగతులతోనూ లయ వేగ మునకు ఉప్పొంగిపోయే దేహంతో ఒకరి నొకరు అభినం దించుకొంటారు.

## కత్రీ :

కత్రీ అనబడే నృత్యం పంజాబు లోయలలోనూ మైదానాలలోనుకూడా చేస్తారు. ప్రతి దేవునికి స్వంతనృత్య గాన బృందాలు కలవనే విశ్వాసం పంజాబులో సర్వత్ర ఉన్నట్లు తోస్తుంది. ఈ విధంగా ఈ మనోహరమైన లోయలో జన్మించినవారికి నృత్యము ఆనంద విషయికమే కాకుండా కొంతవరకు మతప్రాముఖ్యమునుకూడా పొందింది. కత్రీ, వీరికి ప్రియతమమైన నృత్యాలలో ఒకటి.

దీనిని సర్వసాధారణంగా, పంట కోతలైన తర్వాత, పౌర్ణమిరాత్రి ప్రదర్శిస్తారు. నర్తకులు చేతులు చేతులు పట్టుకొని వలయాకారంగా ఏర్పడటంతో ఈ నృత్యమారంభమవుతుంది. స్త్రీలు పాడే అనుసరణ గీతం వేగం హెచ్చేకొద్ది చేతులతో, పాదాలతో, తాళంవేస్తూ, అన్నివైపులకు ఊగుతారు. పాటలోని భావానికి అత్యంత సన్నిహితంగా ఉంటాయి నృత్యగతులు. ప్రేమభావ వ్యక్తీకరణమునుండి, చారిత్రక సంఘటనల వర్ణనవరకు దేవతా ప్రార్థనలవరకు ఇతివృత్తాలు మారుతూ ఉంటాయి. 'కత్రీ'కి సన్నాయి ఢోలు వాద్యగానాన్ని సమకూరుస్తాయి.

## థమ్యాల్ :

హారియానా ప్రాంతపు ప్రజల పురాతన జాతీయ నృత్యం థమ్యాల్. దీని ఇతివృత్తాలు మిశ్రితాలు. వీనిలో కొన్ని, రానున్న వసంతాన్ని గూర్చి, సస్యసమృద్ధినిగూర్చి ఆనందాన్ని ప్రకటిస్తే, మరికొన్ని కొంతవరకు భక్తిభావాన్ని

ప్రకటిస్తాయి. ప్రజలు ధ్యాననిమగ్నులై ఉండగా నృత్య రాజయిన నటరాజు, స్వర్గధామంనుండి అవతరించి వారిని ఆశీర్వదిస్తాడు. దీనితో వారిలోని కళాభావము ప్రబుద్ధమవు తుంది; వారిలో ఆకస్మిక పరివర్తనం వస్తుంది; ఆనందంతో వారు నృత్యమారంభిస్తారు. ఈ నృత్యములోని రెండవదశ మనోహరగతులతో నిండి ఉంటుంది; గానము కొనసాగేకొద్దీ ఇవి పరాకాష్ఠ నందుకొంటాయి.

## కాశ్మీర్ :

కాశ్మీరు లోయలోని ప్రజలు హిమాలయ దైవముల అంకంలో ఉన్నారు; భారతదేశంలోని ఇతర ప్రజాసంఘ మేది కూడా ఇలా లేదు. వారి జీవితచక్రంలో 'ప్రకృతి' కలసిపోయి వుంది. హిమమయమైన కాశ్మీరు శీతాకాలము, అందమైన ఈ లోయలోని ప్రజలను, నెలల పర్యంతము, ఏ చీకటికోణంలోనో, కిక్కిరిసి కలసి ఉండేటట్లు చేస్తుంది. నీడలు పొడవవుతాయి; సూర్యకిరణాలు ఉష్ణముకొరకు సమా కృష్టమయినటే చంద్రదశలకాంతి, వెలుతురుగా సమావరింప బడుతున్నది. అయితే, ఉన్నతపర్వతాల ఘనీభూత శిఖ రాలు తమ మంచును కరగించేటప్పుడు, శీతాకాలం కడచి పోతుంది; అప్పుడు, గొర్రెలు, గొర్రెలకాపరులు, కొండ లతో తమ పరిచయాన్ని పునః ప్రారంభిస్తారు. సరస్సులోని నీరు గడ్డకట్టటం మాని పీచ్, ప్లమ్ చెట్లు పూతపట్టుతున్న ప్పుడు వసంతం ప్రవేశిస్తుంది. ఈ ఋతుపరిమాణానికీ ప్రకృ తితోకల సన్నిహిత సంబంధానికీ అనుగుణంగా కాశ్మీరు నృత్యాలు, సంగీతం రూపొందినవి. వాళ్ళకు అత్యంత ప్రీతి

పాత్రమైన నృత్యాలలో కఁజీ ఒకటి - ఈ నృత్యాన్ని స్త్రీలు మాత్రమే చేస్తారు. అందరు గుంపుకూడుతారు; పాట పాడుతూ ఒకరిచేతులొకరు పట్టుకొని, ఒకరిచేతినొకరు చరుస్తారు; తర్వాత ఇద్దరిద్దరు కలసి గిరున తిరుగుతారు; పాట పల్లవి నర్తకులతోపాటు చుట్టు నిలచి ఉన్నవారు కూడా పాడుతారు. అప్పుడప్పుడు, రెండు వరుసలు ఏర్పడి, ఈ వరుసలగుండా స్త్రీలు జంటలుగా దూరివచ్చి; ఒకరితో ఒకరు నృత్యం చేస్తారు.

సంప్రదాయసిద్ధంగా, కాశ్మీరీయులు చేసే మరొక నృత్యం బండానృత్యం - ఇది నిజానికి సుఫైనా సంగీత సంప్రదాయానికి చెందినది. దీనిలో చాలావరకు శాస్త్రీయ నృత్యంలోని అభినయాన్ని పోలిన దాన్ని ప్రదర్శించటం మనం చూస్తాము. ఈ ప్రదర్శనలలో నృత్యవృత్తిలో ఉండే స్త్రీలు హాఫిజ్ అని పిలువబడేవారు పాల్గొంటారు. వంత పాటను నడిపేవారు; ఈ సంగీతరూపకంలోని నృత్యభాగాలను నడిపేవారుకూడా వీరే.

కాశ్మీరీయులకు తెలిసిన నృత్యాలలో కేవలం బాలురు చేసేవి మరికొన్ని నృత్యాలున్నాయి. నర్తకులు, హుషారు పుట్టటానికి చేసే కసరత్తులతో ఈ నృత్యం ప్రారంభమవుతుంది. బాలుడు, మోకరించి, సలాము చేస్తాడు; తరువాత నిలువబడి శరీరభాగాలను సంచలింపజేస్తాడు; ఇది సాయంత్రం వేళ జరుగుతుంది. మెడను కదలించటంతో ఆరంభించి తర్వాత నడుము ఆతర్వాత కటి, చిట్టచివరకు పాదాలు కదిలిస్తాడు. ఈ సంచలనాలు క్రమంగా మరింత సంక్లిష్టమై

పర్యవసానంగా ప్రతిఅడుగు వేసేటప్పుడు, అతని నడుంపూపులో కీళ్ళన్నీ తొలగిపోయినట్లుగా కనిపిస్తాయి. ఈ రీతిగా నడుము ముందుకు వెనుకకు ఊపటం, కాశ్మీరు నృత్యాలలోని ప్రత్యేకరీతిగా తోస్తుంది. ఆ తర్వాత నర్తకుడు సలాముచేసి ప్రేక్షకులవైపు వేళ్ళు చూపుతాడు; ఇది స్వాగతాన్ని అభినందనను సూచిస్తుంది.

హిమాచల్ ప్రదేశ నృత్యాలతోనూ ప్రత్యేకంగా కాంగ్రాలోయ నృత్యాలతోనూ ఎక్కువ పోలికలు గల నృత్యాలు జమ్మూలోయలో ఉన్నాయి. ఈ ప్రతి ఒక్క నృత్యరీతిలోనూ ఎంతో భిన్నత ప్రత్యేకత ఉన్నప్పటికినీ, గణుతింప తగిన ఒక సంప్రదాయైక్యము వీనిలో ఉన్నది; ఈ అసాధారణ పరిస్థితి ఒక్క భారతదేశంలోనే కన్పిస్తుంది.

ఇలాటి నృత్యాలలో గద్దీనృత్యం ఒకటి; ఈ నృత్యం మూడు దశలుగా ప్రదర్శింపబడుతున్నది. జమ్మూకాశ్మీరు రాష్ట్రంలోని బడెర్వాలోనున్న కైలాస్ సరస్సువద్ద జరిగే ఉత్సవాలలో - ఇది ముఖ్యాంగంగా ఉంది. దోడజిల్లా ప్రజల దైవమైన వాసుకినాగ్ పూజాసందర్భంలో సెప్టెంబరు నెలలో ఈ ఉత్సవాలు జరుగుతాయి.

పిల్లన గ్రోవులు, డోళ్ళువాయిస్తూ ఉండగా ఈ నృత్యం ప్రశాంతగతులతో ఆరంభమై క్రమక్రమంగా వేగం తీవ్రతరమవుతుంది. నర్తకులు చప్పట్లు చరుస్తూ 'వాసుకినాగ్'ను ప్రస్తుతిస్తూ నినాదాలు చేస్తారు.

## 2. తూర్పు ప్రాంతము

భారత దేశపు పీఠభూమియొక్క ఈశాన్యపు సరిహద్దును యావత్తు వాస్తవికంగా హిమాలయాలు, సంరక్షిస్తూ ఉండగా ఈ పర్వతాల పాదతలాన ఉన్న మైదానాలు, క్రమక్రమంగా సముద్రందాకా వ్యాపించి వున్నాయి. తూర్పు తీరంలో, ఒరిస్సా, బెంగాలురాష్ట్రాలున్నాయి. బీహారు కొంతమట్టుకు లోతట్టున ఉన్నప్పటికీ, సాంస్కృతికంగానూ, ప్రజల జాతి సంబంధంద్వారానూ ఈ రెండురాష్ట్రాలకు చాలా సన్నిహితంగాఉంది. నిజానికి అటు బెంగాలు, ఒరిస్సా జానపదసంప్రదాయాలకూ ఇటు ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్ జానపద సంప్రదాయాలకూ, బెంగాలు అనుసంధానకర్తగా ఉంది. ఈ ప్రాంతాలలోని భారత దేశపు ఆదిమజాతులు జానపద, గిరిజన నృత్యాల మహత్తర సౌభాగ్యాన్ని సంతరించి ఉంచారు. ఒరిస్సాలోని సోరియాలు, గడబలు, జువాంగ్‌లు, ఖోండ్‌లు, గోండులు, బైగాలు, మురియాలు, బీహార్‌లోని హోలు, ఓరయాన్‌లు, బర్లంగా తెగల ప్రజలుచేసే విశిష్ట నృత్యాలను ప్రత్యేకంగా, పరిపూర్ణంగా పరిశీలించటం చాలా అవసరం. ఈ నృత్యాలలో కేవలం ప్రాపంచిక నృత్యాలనుండి, తీవ్ర యుద్ధ నృత్యాలవరకు, యుద్ధనృత్యాలను బోలిన మతాచార కర్మలకు సంబంధించిన నృత్యాలవరకు ఉన్నాయి.

## ఒ రి స్సా :

ఒరిస్సాలో గిరిజన జాతులు అసంఖ్యాకంగా ఉన్నాయి. వీరు అటు నాగజాతులకు, ఇటు బీహారులోని అనాదిజాతి తెగలకు సంబంధించినవారు. ఎక్కువగా యుద్ధరీతినిపోలిఉండే నృత్యాలలో నాగ నృత్యం ఒకటి. నిజానికి ఇది మణిపూరు కొండలలో మనం చూచిన నాగనృత్యం వంటిదికాదు; అయితే; ఈ నృత్యంలో నర్తకుడు ఒరియావీరుని ప్రతాపాన్ని ప్రదర్శిస్తాడు.

మయూర్ భంజ్ సంస్థానంలోని చౌనృత్యం, ఒరిస్సా యొక్క విశిష్ట నృత్యరూపం. సెరై కేలా చౌనృత్యానికీన్నీ ఈ చౌనృత్యానికిన్నీ భేదం ఉంది. సెరై కేలా చౌనృత్యం ఎక్కువగా శాస్త్రీయ నృత్య పద్ధతికి సంబంధించినది; కాని, చౌనృత్యం మాత్రం చాలామట్టుకు భారతీయ జానపద నృత్యాలలో ఒకటి. ఒక్కొక్కప్పుడు ఈనృత్యంలో కృత్రిమ ముఖాలు ధరిస్తారు. తరచు అవిలేకండానే చేస్తారు. సంప్రదాయసిద్ధమైన మయూర్ భంగ్ చౌ, పైక్ (ఒరియా క్షత్రియ యుద్ధవీరు)ల యుద్ధనృత్యం.

కళింగయుద్ధానికి సంబంధించిన పురాతనగాథ పైక్ నృత్యానికి కేంద్రబిందువు. కళింగము స్వతంత్ర రాజ్యంగా ఉన్న పూర్వపుకాలంలో, గ్రామసేన లేక కర్షకసేన శాంతి భద్రతలను కాపాడుతూ, శత్రువుల దండయాత్రనుండి దేశాన్ని సంరక్షిస్తుండేదనీ, దేశ ప్రజాజీవితంలో గౌరవప్రదమైన స్థానాన్ని ఆక్రమించి ఉండేదనీ అంటారు.

పైక్ నృత్యం ఒకరకమైన జానపదనృత్యం; రోజంతా కష్టపడి పనిచేసిన అనంతరం గ్రామసైనికులు, వినోదంకోసం ఈనృత్యం చేస్తారు.

శరదృతువులో దసరా సెలవుల రోజులలో ఇంచు మించు అన్ని వర్గాల ప్రజలున్నూ, పూజలతో కాలంగడుపుతారు. ఈ పూజా ఉత్సవాలు విజయదశమి, లేక దసరాతో అంతమవుతాయి. దసరా అంతాన, చివరిరోజున జలనిమజ్జనం కొరకు విగ్రహాలను బైటికి తెస్తారు. పేరు తెలియపరచినట్లు ఈరోజు విజయాన్ని సూచిస్తుంది. ఈరోజున ప్రారంభించిన ఏ పనియైన విజయవంతమవుతుందని చాలామంది నమ్ము తారు. శుభముహూర్తాన, మంత్ర తంత్రాలతో తమ పనుల నారంభించటం, అన్ని వృత్తుల ప్రజలకు ఆచారంగా ఉంది. గ్రామసేన, తదితరులతోకూడి మామూలు కోలాహాలంతో, ఈ రోజున రాజుగారికి తమ అభివందనాలు తెల్పటంకోసం కోటకు వెళ్తూవుండేది.

ఈరోజున పైక్ నృత్యం ప్రజాభిమానం చూరకొన్న జానపదనృత్యంగా సాగుతుంది. దీనిలో పైక్ లు-కర్షకసేన సభ్యులు-పాల్గొంటారు. ఈ నృత్యం గ్రామీణ ప్రాంతాలలో ప్రస్తుతం వ్యాప్తిలోఉండి, పూర్వకాలపు కర్షకసేనల కుటుంబీకులచేత చేయబడుతున్న 'నెగడిదరినృత్యా'నికి చాలా దగ్గరగా ఉంటుంది.

పైకాలు మరికొన్ని నృత్యాలుకూడా చేస్తారు, వీని లోని ఇతివృత్తం కిరాతార్జునీయం. కధాకలినర్తకులు ప్రద

ర్శించే కిరాతార్జున్‌లోని ఇతివృత్తమూ ఇదీ చాలామట్టుకు ఒకేరీతిగా ఉంటాయి.

వీ. గరుద్వాహన్ అనే మరొకనృత్యంకూడా చేస్తారు. ఇందులో గరుడుడు, విష్ణువుతో సమానాధికారంకోసం యుద్ధం చేస్తాడు, తన శత్రువుయొక్క దివ్యస్వభావాన్ని గుర్తించిన పిమ్మట లోబడుతాడు. పైకాల నృత్యాలన్నీ స్వభావతః చాలా శక్తిసంపన్నంగా ఉంటాయి. వాళ్ళు తమ ఖడ్గాలను, డాలులను పరమాద్భుతమైన లక్ష్యశుద్ధితో ఉపయోగించటం చూస్తుంటే కళ్ళపండుగగా ఉంటుంది.

మాయాశబరి అనేది బృందనృత్యం. సత్యయుగంలో, సముద్రమథనకాలంలో, విష్ణువు మోహినివేషం ధరించి, మహాదేవ్‌ను ప్రలోభపెట్టాడు. పార్వతికి సహజంగా కోపం వచ్చింది; అయితే, ద్వాపరంవరకు అదనుకు వేచిఉంది; అప్పుడు 'శబరి'గా వేషంవేసుకుని, కృష్ణుని ప్రలోభపెట్టటానికి చెలికత్తెలతోపాటు బయలుదేరింది. కృష్ణుడు ఆమెసౌందర్యానికి ముగ్ధుడై, కైలాస శిఖరంవరకు ఆమెను వెన్నాడాడు. సరిగా ఆ సమయానికి మహాదేవ్ కనిపిస్తాడు; కృష్ణుని చంపటానికి సిద్ధపడతాడు. అంతటితో పార్వతి పూర్తిగా సంతుష్టి పొందినదై అడ్డుపడుతుంది. తన భర్తకు జరిగిన అవమానానికి తానేవిధంగా దిగ్విజయంగా బదులు తీర్చుకొన్నదీ వివరిస్తుంది. కృష్ణుడు సిగ్గుపడి, ప్రాణభిక్ష వేడుతాడు. ఈ నృత్యంలో దేవుళ్ళు దేవతలలోకెల్ల మహాఘనులైనవాళ్ళు, సామాన్య మనుష్యమాత్రులుగా పరిగణించ బడుతారు.

మయూర్ భంజ్ లోని భూమియాలు అనేకరకాల నృత్యాలు చేస్తారు. భదన్ నెలలో, శుద్ధఏకాదశి రాత్రి కరణ్ ప్రదర్శిస్తారు. కరణ్ అంటే సంపద. ప్రజలకు సస్య సమృద్ధిని అనుగ్రహించటానికి, ఆయురైశ్వర్యములను ప్రసాదించటానికిగాను ఈశ్వరుణ్ణి ప్రసన్నుణ్ణి చేయటంకోసం ఈ ఉత్సవం జరుపబడుతున్నది. అరణ్యంలోనుంచి ఒకవృక్షాన్ని తెచ్చి గ్రామంలో నాటుతారు. ఒక మట్టికుండలో కొంచెం మట్టివేసి, ఆ చెట్టుకింద పెడతారు. సంపద ధాన్యంగా భావించబడే వరి, ఇతర ధాన్యాల విత్తనాలను, ఆ తరువాత, ఆకుండలో వేస్తారు. ఈ వ్రతాన్ని అనుష్ఠించేవారు ఆ రోజు ఉపవాసంచేసి, ఆ రాత్రిఅంతా నృత్యం చేస్తారు. ముందాలి నృత్యం అన్నిటా కరణ్ నృత్యాన్ని పోలిఉంటుంది. రెండిటికి ఉన్న భేదమల్లా లయలోనే.

భూమియాలు, తమ తెగకు దేవుడైన బురుబాంగ ప్రీత్యర్థం జదూర్ నృత్యం చేస్తారు. సమీపంలో ఉన్న కొండమీద గ్రామస్థులందరు సమావేశమై, పఛువార్జని (వరిఅన్నంనించి తయారుచేసిన ఒకవిధమైన సారాయి) క్రింద పోస్తూ దేవునికి నివేదిస్తూ, త్రాగుతూ ఈనృత్యం చేస్తారు. సారాయి కొండకు ఏ ప్రక్కన ప్రవహిస్తుందో ఆ ప్రక్క భూమి వ్యవసాయమునకు నాణ్యమైనదిగా భావిస్తారు. ఈ ఉత్సవం ముగియగానే, గ్రామస్థులు నృత్యంచేస్తూ కొండదిగి తిరిగి గ్రామం చేరుతారు.

ఒరిస్సాలోని సుకుమార నృత్యాలలో ఘుర్మావంటి నృత్యాలు కొన్ని ఉన్నాయి. పైకాల పౌరాణిక, లేక యుద్ధ



33. పై చిత్రం : ముసుగు ఛౌ నృత్యం, సరైకేలా: బీహార్




34. క్రింది చిత్రం : ఓరౌర్ నృత్యం; బీహార్





35. చిత్రం : ఓరార్ వాద్య సమ్మేళనము





36. పై చిత్రం : ఛోటానాగపూర్
ఆదిమవాసుల నృత్యం: బీహార్

37. క్రింది చిత్రం : ఛౌ నర్తక బృందం; బీహార్





38. పై చిత్రం : సంతాల్ నృత్యం; పశ్చిమబెంగాల్

39. క్రింది చిత్రం : సంతాల్ నృత్యం; పశ్చిమబెంగాల్



నృత్యాలకూ దీనికీ పోలికేలేదు. ఒరిస్సా హరిజనులు వివాహ సందర్భాలలో ఈనృత్యం చేస్తారు. ఇందులో పురుషులు, స్త్రీలు ఉభయులు పాల్గొంటారు. ఒరిస్సా పద్ధతిగా సాదా చీరెలు ధరిస్తారు. అయితే, సొగసైన వెండి ఆభరణాలను ధరిస్తారు.

ఘుమర్ నృత్యాలలో చాలా రకాలున్నాయి. ఒరిస్సాలోని సుందర్‌గర్ జిల్లాకు సంబంధించిన ఓరవున్ తెగలవారు ఒకరకం నృత్యం చేస్తారు; ఈ నృత్యంలో సాద్రీ భాషలోని చక్రనిపాట పాడుతారు. ఓరవున్ ఘుర్మాపాటలు, పులి లేగదూడలను మ్రింగటం, గౌడ్రాలైన ఇల్లాలు పిల్లల కోసం పలవరించటంవంటి విషయాలను గూర్చి ఉంటాయి.

లయావైవిధ్యం, వేగవంతమైన కరచలనాలు ఒరిస్సా నృత్యాలన్నిటిలోని ప్రత్యేకరీతి అనే సంగతి గుర్తుంచుకోవాలి. సంకీర్ణమైనాకూడా, సౌందర్యపూర్ణంగా ఉండే ఒరిస్సా నృత్యాలను చూచినప్పుడు, ఈ ప్రాంతపు జానపద నృత్యాలు; శాస్త్రీయ నృత్యాలు ఏ విధంగా ఏకకాలాన అభివృద్ధిపొందినవో బోధపడుతుంది.

## బెంగాల్ :

బెంగాలు జానపద నృత్యాలు, సంతాలుల గిరిజన నృత్యాలు మొదలు, బౌలుల అతి సున్నితమైన భక్తి నృత్యాల పర్యంతం ఉన్నాయి.

ఆదిమవాసుల జానపదనృత్యాలలో సంతాల్‌నృత్యం గొప్పదని సులభంగా చెప్పవచ్చు. సంతాలులు, ప్రత్యేకంగా వారి స్త్రీజనం సహజమైన ఉత్సాహగుణానికీ, తరుగని

యౌవనానికీ పేరుపొందారు. దేశాయి (దసరా అనే పదానికి మరొక రూపం) నృత్యం దుర్గపూజతోపాటు జరుగుతుంది. దుర్గపూజ మహోత్సాహంతో, వినోదాలూ వేడుకలతో జరుపుతారు. గుంభేరియానృత్యం వివాహ సందర్భాలలో చేస్తారు. బ్రతా అటవీనృత్యంచేసి, తద్వారా అడవులలో నివసించే కల్పిత దేవతలను ప్రీతిపరచినట్లు భావిస్తారు.

క్రమబద్ధమైన బెంగాలు జానపద నృత్యాలలో అత్యంత వ్యాప్తిలోఉన్న నృత్యం కీర్తన్. ఇది చాలా పురాతనమైనదిన్నీ, చైతన్యుడు మొట్టమొదట వైష్ణవ మతాన్ని ప్రచారం చేసిన కాలంనాటిదిన్నీ. కీర్తన్ ప్రధానంగా సామాజికనృత్యం; కులము, హోదా, వయసుతో నిమిత్తంలేకుండా అందరూ ఇందులో పాల్గొనవచ్చును. ఈ నృత్యం చాలా సరళంగా వుంటుంది. నృత్యం చేసేటప్పుడు ఖోల్ లేక ఢోల్ వాయిస్తారు. ఢోలు దెబ్బకు అనుగుణంగా, భక్తులు వలయాకారంగా తిరుగుతూ, చేతులు దించుతూ ఎత్తుతూ ఉంటారు. రసవంతంగా రచింపబడిన పాటలలోని గాఢభక్తిభావానికీ, కవితా ప్రబోధానికీ సంగీతం అనుగుణంగా ఉంటుంది. పాటతోపాటు నృత్యం కూడా ఉద్రేకభావంలో అధిరోహిస్తుంది. ఒక్కొక్కప్పుడు కీర్తనబృందం, వీధులగుండా ఆడుతూపాడుతూ పోవటంకద్దు. ఈరీతి నృత్యాన్ని నగర కీర్తన అంటారు.

గ్రామీణప్రాంతాలలో సంగీతం ప్రజాసామాన్యానికి కాలక్షేపంగా ఉంది. బౌల్ పాటలు ఉల్లాసంగా ఉంటాయి. ఈపాటలతో చేసే నృత్యం, అనుసరణనృత్యంగా చేయబడి

నప్పటికినీ, ఒకానొక ఆనంద పారవశ్య వాతావరణాన్ని సృష్టిస్తుంది. ఏకతార (ఒంటితీగవున్న సంగీత వాద్యం) దీనికి సంగీతాన్ని సమకూరుస్తుంది. బౌల్ నృత్యానికి మతసంబంధ మైన ప్రత్యేక క్రతువులతోగానీ, పండుగలతోగాని ప్రమేయం లేదు. స్థల, కాల విచక్షణలేకుండా దీనిని ప్రదర్శించవచ్చును. ఏకాస్తడబ్బు ముట్టచెప్పినా ఈనృత్యం ప్రదర్శించే సంచార గాయకులున్నారు.

బెంగాలులో జాత్ర అనబడే నృత్య నాటకరూపం వుంది. ఇది 400 ఏండ్లనుండి పారంపర్యంగా వస్తూ ఉంది. దీనిని సంచార బృందాలు ప్రదిర్శిస్తుంటాయి. సంగీత రూపకం పద్ధతిగా, ఈ నృత్యంలో చాలాపాటలు పాడుతారు. జాత్రబృందం తర్ఫీదు పొందుతుంది. ఈవృత్తిలో ఉండే వ్యక్తి ఈ బృదానికి నాయకుడుగా ఉంటాడు. ఇతనిని అధి కారి అని పిలుస్తారు. ఇందులోని ఇతివృత్తాలు సాధారణంగా కృష్ణలీలల్లోనుంచి తీసుకొన్నవే. అయితే, స్వాతంత్రోద్యమ కాలంలో, దేశభక్తి ఇతివృత్తంగాగల జాత్రలు అనేకం రచింపబడి, ప్రదర్శించబడినవి. సాంఘిక ఇతివృత్తాలుగల జాత్రలుకూడా ఉన్నాయి.

మాల్డాజిల్లాలో ప్రత్యేకబాణిగలనృత్యం, సంగీతం ఉన్నాయి. ఇక్కడపాడే పాటలన్నీ ప్రధానంగా 'గంభీర'మైన పాటలు. వీనిలోని ఇతివృత్తాలు అనేకరీతులుగా ఉంటాయి. మతవిషయాలు మొదలు గ్రామంలోని నిత్యజీవిత సంఘటనలవరకు దీనిలో వుంటాయి. గంభీర గీతాలకు, తదనుగుణ నృత్యానికీ, అప్పుడప్పుడు వర్తమాన సాంఘిక,

రాజకీయ సమస్యలుకూడా భావప్రేరణం కల్పించటంకద్దు.

ప్రత్యేకంగా పురుషులే చేసే మరొక నృత్యం ఝుమర్ బోలన్. శివ, దుర్గ, తదితర దేవతల ప్రస్తుతి చుట్టు ఈ నృత్యం అల్లి ఉంటుంది. ముఖ్యంగా చైత్ర సంక్రాంతి కాలంలో ఇది ఎక్కువగా ప్రదర్శించ బడుతుంది. బెంగాలులో అత్యంత ప్రచారం గల జానపద నృత్యాలలో ఇది ఒకటి. ఈ నృత్యానికి సంగీతం, భక్తిగీతాల ద్వారానూ, మదాల్. తాళాల ద్వారానూ సమకూర్చ బడుతుంది. మదాల్, తాళాలు, ఈ రెండు ఎక్కువ ప్రచారంలో ఉన్న సంగీత వాద్యాలు. ఇవి, బెంగాలులోనూ ఒరిస్సాలోనూ కూడా ఉపయోగంలో ఉన్నాయి. మదాల్ వాద్యం మణిపూరి ఖోల్ కు దక్షిణాది మృదంగానికీ కొంచెం తేడాగా ఉంటుంది.

బెంగాలులోని కొన్ని ప్రాంతాలలో, పూర్వకాలపు అవశేషాలుగా, కొన్ని యుద్ధనృత్యాలు, వెనుకపడ్డ తరగతుల ప్రజలలో ఇప్పటికీ నిలిచి ఉన్నాయి.

బర్ద్వాన్, బీర్ భూం జిల్లాలలోని బౌరీలు, డోనులు రై బాంషీ నృత్యం చేస్తారు; బెంగాలు నృత్యాలలో కెల్ల ఇది పురుష భావస్ఫోరక మైనది. దీనికి, డోలు, కంసీలు అనుసరణ గానాన్ని సమకూరుస్తాయి. నర్తకులు కుడి పాదాలకు నూపురాలు (గజ్జెల పట్టీలు) కట్టుకుంటారు. నృత్యంలో వేగం హెచ్చుతూ ఉండే సమయంలో వాళ్ళు భయంకరమైన యుద్ధనినాదాలు చేస్తారు. వాళ్ళగతులు, అభినయం విల్లును ఎక్కు పెట్టటాన్ని శూలాల్ని విసరటాన్ని, కత్తిని ఝుళిపించటాన్ని మొదలైనవి సూచిస్తాయి. ఈ కొలను గట్టి వెదురు గడలతో

చేస్తారు; వాటికొసన, పదునైన ఉక్కు శూలాగ్రాలుంటాయి. ఈనృత్యంలో ఈబల్లెములనుపయోగిస్తారు. సంగీతవాద్యంలో ఢోల్, కంసీలకు, ఢంకాలు కూడా తోడుగా ఉంటాయి.

లయ తప్పని పాద గతులకు, నర్తకులు చేతులతో పట్టుకొనే కోలాటపు కర్రల క్రమంతప్పని మ్రోతలకు కథి నృత్యం అనన్య సామాన్యమని చెప్పవచ్చు. నర్తకులు వలయాకారంగా జరుగుతూ జరుగుతూ విడిపోయి అనేక నమూనాలుగా ఏర్పడుతారు. అయితే, ఒక్క కోలాటం దెబ్బ, తప్పిపోవటంగానీ, తాళవేగం తగ్గటంగానీ ఎన్నడూ జరగదు. నర్తకులలో ఒకరు, వలయం మధ్యకు చొచ్చుకు వస్తాడు. వచ్చి, కోలాటం కర్రలను కొడుతూ, పాదాలతో తాళంవేస్తూ, చుట్టు తిరుగుతూ నృత్యం చేస్తాడు. వలయం మధ్య ఉండే నర్తకుడు ఆతెగ వారి క్రోధానికి గురియైన వాడుగా భావించ బడుతాడు.

## బీహారు :

సంతాలు గిరిజనులు కూడా, బీహారులోని ఛోటా నాగపూర్ అడవులలో నివసిస్తున్నారు. బీహారు సంతాలుల నృత్యాలు బెంగాలు సంతాలుల నృత్యాలూ ఒకేరీతిగా ఉంటాయి. బెంగాలు సంతాలు నృత్యాలలో వలెనే బీహారు సంతాలు నృత్యాలలోనూ తదితర నృత్యాలలోను కూడ, స్త్రీలు, ఒండొరుల నడుముల మీదుగా చేతులు లంకెలు. వేసుకొని, పరిపూర్ణమైన ఏకత్వంతో, సరాసరి ఎదురు నడకల వంకర గతులతోనూ నడుస్తారు. పాదచలనాలు దీనిలోని ప్రత్యేక లక్షణం; 50 మొదలు 60 మంది యువతులు ఒకేసారి

ఒకేకాలు ముందుకెత్తటం చూస్తుంటే సుందర సమ్మోళనంగా తోస్తుంది.

బీహారులో హో తెగవారి నృత్యాలు వారి నిత్యజీవిత సుఖదుఃఖాలను ద్యోతకం చేస్తాయి. ఇవి, ఐదు వేర్వేరు ఉత్సవాల సందర్భాలలో ప్రదర్శిస్తారు. ప్రతిదానికి ఒక ప్రత్యేక లక్షణం ఉంది. మాఘే నృత్యం స్థానిక దేవతల ఆవాహన రూపంగా ఉంటుంది. బా నృత్యం, శృంగార, వీరములకు, వేటకు, యుద్ధానికి సంబంధించినది. హిరోయోర్ బా దగ్గరగా ఉంటుంది. అయితే దీనిలో పాటలు వ్యవసాయానికి వానలకు, మబ్బులకు సంబంధించి ఉంటాయి. జోంనామా నృత్యం క్రొత్త పంటల కోతలప్పుడు చేస్తారు. వివాహానృత్యం, ఒకసాంఘిక కార్యక్రమంలా గా ఉంటుంది. దీనిలో శకునాలకు ప్రాముఖ్యం ఉంటుంది.

**జదుర్ నృత్యం:**

పితృసత్తాక జాతియైన ఒరియనులు ఛోటానాగపూరు ప్రాంతమంతా వ్యాపించి ఉన్నారు. వీరి నృత్యసంపదలో ఒక్కొక్క ఋతువుకు వేర్వేరు నృత్యాలున్నాయి.

జదుర్ నృత్యంలో, శృంగార, అద్భుత రసాలను ప్రకోపింప జేసే వసంతంయొక్క సమ్మోహన గుణాన్ని, ఒరయన్‌లు ప్రదర్శిస్తారు. దీనిలో, ప్రధాన ఇతివృత్తం శృంగారం. యువకుడు, కన్యకలిసి నృత్యంచేస్తూ పాడుతారు. "స్త్రీ ప్రేమ, ఆమె సౌందర్యం శాశ్వతంగా ఉంటాయి." అనే పాటలోని శృంగార భావాని కనుగుణంగా నృత్యంచేస్తూ

నర్తకులు, ఉల్లాసకరమైన ఋతువుకు స్వాభావికమైన శక్తితోనూ, వివశత్వంతోనూ చుట్టుతిరుగుతారు.

**ఖరియాల నృత్యాలు :**

రాంచీప్రాంతంలోని దుర్గమ పర్వతాలలో నివసించే ఖరియాలు, బహుశః, ఛోటానాగపూరు ప్రాంతంలో నివసించే ఆదివాసుల వర్గాలలోకెల్ల చిన్నవర్గమని చెప్పవచ్చు. వీరు ప్రధానంగా పశువులమందలను మేపుకొని జీవించేప్రజలు. వీరి నృత్యాలలో ప్రకృతి ప్రధాన ఇతివృత్తంగా రూపొందింది.

బీహారులోని హరిజనులు, ఆదివాసులు బర్లంగా నృత్యాలను ప్రదర్శిస్తారు. బర్లంగా అనేది కొన్ని గ్రామాల సమూహం. ఇక్కడ ఈ నృత్యాలు సర్వత్రా కనిపిస్తాయి. ఈ నృత్యాలలోనిరీతి ఒకేవిధంగా ఉండదు. కలగాపులగంగా ఉంటుంది. సంతాలులు, భిల్లులుమొదలైన గిరిజనుల జానపద గాథలనుండి తీసికొన్న విషయాలపై ఈ నృత్యాలాధారపడి ఉంటాయి.

నృత్యప్రదర్శనం నాలుగుభాగాలుగా ఉంటుంది. యుద్ధ నృత్యం, ఉత్సవనృత్యం, పౌరాణికనృత్యం, ఏకత్రానృత్యం. యుద్ధనృత్యం రెండువర్గాల ప్రజలమధ్య జరిగే 'అభినయ' యుద్ధం; ఇది సర్వసాధారణంగా వివాహ సందర్భాలలోనూ, దసరా కాలంలోనూ ప్రదర్శిస్తారు. కర్మ ఉత్సవనృత్యం, ఛోటానాగపూరులోని భిల్లులలో చాలా ప్రసిద్ధికెక్కింది. భడో నెలలో ఈనృత్యం చేస్తారు. దీనిలో 'కర్మ' వృక్షాన్ని పూజలుచేయిస్తారు. సస్యసమృద్ధినికోరి చేసే ప్రార్థనతో

ఈ నృత్యం అంతమవుతుంది. పౌరాణిక నృత్యం మహా భారతంలోని కిరాతార్జున యుద్ధగాథను ప్రదర్శిస్తుంది. దీనిలో అర్జునుడు వేటకువెళ్ళటం, పందిని చంపటం చూపు తారు. ఏకపాత్ర నృత్యంలో ఒక ఆదివాసి యుద్ధ వీరుని దుస్తులు ధరించి, దసరావేడుకలను చూడగూడిన జనానికి తన కౌశలం ప్రదర్శిస్తాడు.

## జిటియా నృత్యం :

పశ్చిమరాంచిలోని గిరిజన ప్రాంతాలలో నివసించే ఒరయనుల నృత్యాలు అనేకరీతులుగా ఉన్నాయి. ఒక్కొక్క ఋతువుకు వేర్వేరు నృత్యాలున్నాయి.

శీతకాలం ఆరంభంలో, వాతారణంసైతం శృంగార, అద్భుతభావాలను ఉద్దీపింపజేస్తున్నప్పుడు జిటియా నృత్యం చేస్తారు. దీనిలోని ప్రధాన ఇతివృత్తం ప్రేమభావ ప్రకటన. ఈ నృత్యగతులు, పాటలోని శృంగార భావాలకు అనుగుణ మైన పద్ధతిగా ఉంటాయి.

ఈనృత్యంలో గాయకులు మధ్యఉంటారు; యువతులు చేతులు చేతులు పట్టుకొని వాళ్ళచుట్టూ వలయంగా ఏర్పడుతారు. యువకులు వీరిచుట్టూ వలయాకారంగా ఏర్పడుతారు. ఢోలు, ఛేచ్కా—(కర్రతోచేసిన సాధారణ వాద్యం) ల చప్పుళ్ళ లయ తప్పకుండా, నర్తకులు ముందుకు వెనుకకు కదులుతారు. మధ్యమధ్య క్రిందకూర్చుని, అందరూ ఒకేసారి చప్పట్లు చరుస్తారు. ఇతివృత్తం భావానుగుణంగా, నర్తకుల పాదగతులు మృదువుగా సుందరంగా ఉంటాయి.

వీరు సంప్రదాయసిద్ధమైన ఎరుపు, ఆకుపచ్చ, పసుపు పచ్చరంగు దుస్తులు, వెండి, ఇత్తడి-ఆభరణాలుధరిస్తారు.

పైన చెప్పినవేకాక, బీహారులో అనేకరీతుల క్రతు నృత్యాలున్నాయి. అలాటి నృత్యాలలో మాఘే ఒకటి. సాలవృక్షారామాలలో నివసించే దసౌలీ దేవతను ప్రసన్నం చేసుకోవటాని కీ నృత్యం చేస్తారు. ఈ తోటలు పరిసరాలలో ఉండే గ్రామస్థులంతా భయపడుతారు. ఎందుచేతనంటే, ఇవి జైరాలని వాళ్ళవిశ్వాసం—అంటే దసౌలీ నివాస స్థానమని. ప్రాణాలను, ఆస్తిపాస్తులను, పశువులను సంరక్షించటం కోసం ఈ దేవతను ఆరాధిస్తారు. ఇలాగే హో తెగవారు కూడా తమకు తరగకుండా నీరుండాలనీ, వేటలో ప్రమాదం జరగకుండా వుండాలనీ, నాగె-ఎర, హుండి-ఎర, మాంగెస్ దేవుళ్ళను పూజిస్తారు.

వసంతకాలంలో జరిగే 'బా' ఉత్సవానికి సంబంధించిన నృత్యాలు చాలా ఉన్నాయి. అప్పుడు తాజాపువ్వులతో ప్రజలు తమ గృహాలనలంకరించు కొంటూరు, ఈ నృత్యగానాలు మూడు రోజులపాటు కొనసాగుతాయి.

హిరో ఉత్సవం, విత్తనాలు నాటేకాలంలో జరుగుతుంది. ఈ సందర్భంలో, పాటలుపాడుతూ ఒక క్రతునృత్యం జరుగుతుంది. పెండలకడ, సమృద్ధిగా పంటలు అనుగ్రహించవలసిందిగా ఈపాటలతో దసౌలీని ప్రార్థిస్తారు.

కోతలు ముగియగానే పాడుతూ, నృత్యంచేస్తూ జోంనామా ఉత్సవం జరుపుతారు.

ఇవేకాక, పెండ్లిండ్లవంటి వేడుకల సందర్భంలో చేసే నృత్యాలున్నాయి.

వర్షర్తువులో పాడే పాటలను, చేసే నృత్యాలను కరమ అని పిలుస్తారు. యువతులచుట్టూ యువకులు మూగుతారు. మరొక గాయకబృందం అనుసరణ గానాన్ని సంతరిస్తుంది. కరమ నృత్యంలో ఒకానొక విషాదచ్ఛాయ కన్పిస్తుంది. నర్తకులు వంగి మెల్లగాజరగటం, డోళ్ళు ఆగిఆగి మ్రోగటం ఈ విషాదభావాన్ని హెచ్చిస్తాయి. ప్రతి ఒకటిన్నర అడుగు తరువాత యువతులు పిట్టలలాగా ఎగురుతారు; క్రిందికి వంగు తారు. ఒకకాలు ఎత్తి, రెండవకాలిమీద యథాస్థితిలో నిలుస్తారు. వీరిని చుట్టి ఉండే యువకులు పాటపాడుతూ, చప్పట్లు చరుస్తూ యువతులవైపు దూకుతారు, వాద్యాలను వాయించేవారు కూడా యువతులముందుకు వస్తారు గాని, శరీరాలను సొగసుగా వంచి తిరిగిపోతారు. నృత్యసమయంలో యువకులు, యువతులుకూడా భుజాలమీద కర్రలు పెట్టు కొంటారు.

వర్షాలుపోయి, ఆకాశం నిర్మలంగా ఉన్నప్పుడు 'మఘా' గానానికి ఉపక్రమిస్తారు; లుర్ఝి, ఝుమార్ లు 'మఘా'యొక్క రీతిభేదాలు. ఈ నృత్యంలో ముందుకు కదిలే గతులు, హ్రస్వంగా, ఆకస్మికంగా ఉన్నా వెనుకకుకదిలే పాదగతిమాత్రం ప్రశాంతసుందరంగా ఉంటుంది.

## 3. మధ్య ప్రాంతము

### మధ్య ప్రదేశ్ :

భారతదేశంలోని అనేక ఆదిమ జాతులకు గిరిజనప్రజకు మధ్యభారత్, మధ్యప్రదేశ్‌లు నిలయంగా ఉన్నాయి. మధ్య భారత్‌లోని భిల్లులు, గోండ్లు, మధ్యభారత్ గ్రామాలలోని, మత, ఉత్సవ, నృత్యాలు, భారత జానపద నృత్యాల మహిత సౌందర్యానికి మరొక స్థావరాన్ని మనకు చేకూరుస్తున్నాయి; సంతాల్, హో, ఓరయన్‌ల గిరిజన నృత్యాలలో వలెనే బైగా, గోండ్, మారియా మొదలైన గిరిజన నృత్యాలలో కూడా స్త్రీలు పురుషులతో సమానంగా పాల్గొంటారు. ఇందులో కూడ స్త్రీలు చేతులు చేతులు పట్టుకొని, పురుషుల కెదురుగా అవక్రగతులలో నృత్యం చేస్తారు. పురుషులు మరొక వరుసగా యేర్పడి ఒకరి వైపు మరొకరు చతురస్రాకారంగా జరిగి, లయాన్వితంగా ఊగుతూ, వెనుకకు జరిగి, మరల ముందుకు జరుగుతారు; కొంతసేపైన తర్వాత స్త్రీ పురుషులు కలిసి నూతన రీతులలో ఏర్పడుతారు.

'కర్మా' గోండుల ప్రధాన నృత్యం. స్త్రీలు చేతులు చేతులు పట్టుకొని, నిదారు వరుసలలో, చతురస్రాకారంగా ఏర్పడుతూ, లయాన్వితంగా ఊగుతూ నృత్యం చేస్తారు. పురుషులు వేరుగా వలయాకారంగా ఏర్పడి, పురుష శక్తిని ప్రదర్శిస్తూ బలోపేతంగా నృత్యం చేస్తారు; కొంత సేపైన

తర్వాత, కొందరు నర్తకులు మరికొందరి భుజములపై ఎక్కుతారు; ఇలా రెండు అంతస్థులుగా ఏర్పడిన నర్తకులు డోళ్ళ ధ్వనులకు, స్త్రీల కరతాళ ధ్వనులకు లయ తప్పకుండా శరీరాల నూపుతూ అడుగు తప్పకుండా జరుగుతారు, పిమ్మట పై కెక్కిన నర్తకులు క్రిందికి దిగి, నృత్యవలయం లోనికి వచ్చి, దాగుడుమూత లాడుతున్నారా అన్నట్లు లోపలకూ బైటికి తిరుగుతారు, క్రమంగా డోళ్ళ ధ్వని వేగం పెరుగుతుంది. శబ్దం పెరుగుతుంది. మహా కోలాహలంతో నర్తకులు నృత్యం విరమిస్తారు.

ఝూమర్ నృత్యాలను బోలిన అనేక నృత్యరీతులను గోండులు సృష్టించు కొన్నారు. ప్రేమ గీతాలు పాడేటప్పుడు, సాంఘిక ఇతివృత్తాలు గల ఇతర గీతాలు పాడేటప్పుడు చేయటానికి ఈనృత్యా లుద్దేశించ బడినవి. తాము నివసించే దారి డొంకలులేని అటవీ ప్రదేశంలో, చాలా దూరం ప్రయాణం చేయవలసి వచ్చినపుడు గోండులు ఊతకోలలమీాద నడుస్తారు. గిరిజనుల ఈ అభ్యాసం నుంచి, గోండ్ యువకులు అద్భుతమైన ఊతకోలల నృత్యం సృష్టించారు. హైందవ పూర్వాచార ప్రేరితమైన, అనేక సంస్కరణోద్యమాలు గోండులలో తలయెత్తి, వారి నృత్యాల వినాశనానికి దారి తీసినవి. ఐతే, ఈ ప్రాంతంలో ఆశ్రమాలను స్థాపించిన సంఘసేవకులు, గోండుల సాంప్రదాయక జానపద సంస్కృతిని ప్రోత్సహించటానికి, సంరక్షించిడానికి దానిని గోండుల అభివృద్ధివికాసాలకు సాధనంగా ఉపయోగించటానికీ ప్రయత్నించారు. దురదృష్టవశాత్తు, ఏవేవో స్వంత అభిప్రా

యాలతో, గోండులపాటలను, నృత్యాలను సంస్కరించాలనీ, బాణీలు ఏర్పరచాలనీ కొందరు ఇంకా మూషయత్నాలు చేస్తూనే ఉన్నారు ఈ ప్రయత్నాలు గోండ్‌ల స్వేచ్ఛతకు, స్వయం వ్యక్తీకరణకుచీడపురుగులు. ఒక్క గోండుల విషయం లోనే కాదు. సమస్తగిరిజన జానపద సంస్కృతుల విషయం లోనూ అంతే.

మధ్యభారత్ భిల్లుల నృత్యాలూ రాజస్థాన్ భిల్లుల నృత్యాలూ ఒకేరకంలో ఉంటాయి. భిల్లుల నృత్యాలలో అనేక రీతులున్నాయి. వీనిలో పేరుపొందిన నృత్యాలు భగురియా, లడాలడీ. పంటకోతలైన తర్వాత, మార్చి నెలలో జరిగే వారంవారం సంతల సందర్భంలో మొదటి నృత్యం చేస్తారు. ఈ సంతరోజులలోనే, యువతీ యువకులు పెండ్లి నిర్ణయాలు చేసుకుంటారు. లడాలడీ నృత్యం వివాహనృత్యం. పెండ్లి కొడుకును, పెండ్లికూతురును చెరియొకరు భుజాలపై నెక్కించు కొంటారు. ఆ దంపతుల చుట్టూ చేరి, అతిథులు బృంద నృత్యం చేస్తారు.

కటపుత్లీ (బొమ్మల నృత్యం) భారతీయ జానపద వినోద ప్రదర్శనలలో ఎక్కువ ఆసక్తిపుట్టించే వానిలో ఒకటి. ఇది ఒక విధమైన బొమ్మల నృత్య ప్రదర్శనము. ఒక రాజు దర్బారు చేయటం, విరోధిరాజు కయ్యానికి కాలుదువ్వటం, యుద్ధం, చివరకు విజయోత్సవం జరుపుకోవటం, ఇది-కటపుత్లీలో సర్వసాధారణంగా ప్రదర్శించే కథ కావచ్చు. ఇలాటి ఇతివృత్తాలకు కావలసిన అవయవ చలనాలు, వేషాలు, సంగీతం-ఏర్పాటు చేయబడి ఉంటాయి.

బస్తర్ గిరిజన ప్రజలు మరియూ గిరిజన ప్రజలు కూడా చేసే సామాన్య నృత్యాలు కొన్ని ఉన్నాయి. ప్రజలకు 'శక్తి' మీద నమ్మకం ఉన్నా, నృత్యప్రదర్శనలలో దంతేశ్వరిని ఆరాధ్య దేవతగా కొలిచినా, వీరి నృత్యాలలో మత ప్రమేయమేమీ లేదు.

భడో పున్నమ రాత్రి నవరాణి నృత్యం చేస్తారు. మాఘంలో దేవరి నృత్యం, చైత్రంలో చైత్ దండ నృత్యం చేస్తారు.

చేలలో విత్తనాలు వేసేటప్పుడు బీజ్‌పుట్ని నృత్యం చేస్తారు. శ్రావణం రాగానే, గోడో నృత్యకాలం వచ్చినట్లు. వర్ష దేవిని ప్రసన్నురాలిని చేయటం కొరకు ఘోంఘా నృత్యం చేస్తారు; ఇది పక్షం రోజుల పాటు కొనసాగుతుంది.

ఈ గిరిజనుల యువజనం లక్ష్మీజాగర్ (లక్ష్మికై మేల్కొని ఉండుట] నృత్యం చేస్తారు. లక్ష్మిదేవి విగ్రహాన్ని షేమాల్ వృక్షం క్రింద ఉంచుతారు. దూరదూరాల గ్రామాల నుంచి యువతీ యువకులు వచ్చి ఆ రాత్రి అంతా నృత్యం చేసి తెల్లవారగానే తమ తమ గ్రామాలకు తిరిగి పోతారు. మరల రాత్రి కాగానే అక్కడ చేరుతారు. ఈ నృత్యం ఒక నెలపాటు కొనసాగుతుంది. యువతులు, అడవులలో కోసి తెచ్చిన సుందర పుష్పాలతో విగ్రహాన్ని అలంకరిస్తారు.

## రాజస్థానం:

అనేకరీతుల జానపద గిరిజన నృత్యాలు గల మరొక రాష్ట్రం రాజస్థాన్. రాజస్థాన్ నృత్యాలలో, పట్టణ ప్రజలు

చేసే నాగరిక సాంఘిక నృత్యాలు మొదలు సన్‌సీల వంటి రాజస్థాన్ గిరిజనుల ఆదిమ నృత్యాల వరకు ఉన్నాయి.

రాజస్థాన్ గిరిజన నృత్యాలలో, ఒకవంక మధ్య భారత్ గిరిజన నృత్యాలను, మరొకవంక సౌరాష్ట్ర గిరిజన నృత్యాలను పోలిన నృత్యాలు చాలా ఉన్నాయి. రాజస్థాన్ భిల్లులు ఇంచుమించు మనిషి జీవితానికి సంబంధించిన అన్ని సందర్భాలలోనూ నృత్యం చేస్తారు. వివాహ నృత్యాలున్నాయి. వీటిలో ఝూరియా నృత్యం చాలా పేరు పొందింది. ఝూరియా అంటే శబ్దార్థం, కొయ్యకర్ర. పురుషులు ఒక వలయంగా, స్త్రీలు మరొక వలయంగా ఏర్పడి; ఢోలు, సన్నాయి, నగారా ధ్వనుల కనుగుణంగా ఉల్లాసం ఉట్టిపడేట్లు నృత్యం చేస్తారు. ఈ భిల్లులు, మధ్య భారత్ భిల్లులు కూడా చేస్తారు, ప్రత్యేకంగా స్త్రీలే చేసే నృత్యాలలో, మాహులో, ఫండారో నృత్యాల వంటివి ఉన్నాయి. ఈ రెండూ వివాహ సందర్భాలలో చేస్తారు. ఈ రెండు నృత్యాలలోనూ, స్త్రీ ప్రదర్శించే గమనరీతి, రాజస్థాన్ భిల్లుల నృత్యాలలోనూ, మధ్యప్రదేశ్ భిల్లులలోను కూడా కన్పించే విశిష్ట లక్షణం—అనుసరణగానం ఇంచుమించు ఉండదనే చెప్పవచ్చు. దీనిబదులు స్త్రీలే పాడుతూ, దాని మీద నృత్యం ఆరంభిస్తారు. నవరాత్రి నాటిరేయి, గర్బా అనే నృత్యం చేస్తారు, ఒక కడవను చక్కగా అలంకరించి, మధ్య పెడతారు; స్త్రీలు చుట్టూ కూర్చొని చప్పట్లు చరుస్తుంటారు. క్రమక్రమంగా వాళ్ళు లేస్తారు. లేచి ఆ కడవ చుట్టూ లయాన్వితంగా నడుస్తారు. ఈ గర్బా

నృత్యం, రాజస్థాన్‌లోనూ, మధ్య భారతంలోనూ, గుజరాత్‌లోనూ కూడా చేస్తారు.

ప్రత్యేకంగా పురుషులేచేసే నృత్యాలలో తీర్ తల్వారు నృత్యం వంటివి ఉన్నాయి; పురుషులు మాత్రమే, కత్తులు, విండ్లు; అంబులు చేతపట్టుకొని దీనిలో పాల్గొంటారు. ఒక్కొక్కప్పుడు పురుషులు; విండ్లు, అమ్ములు, కత్తులేకాక, డాలులు కూడా పట్టుకొని, సన్నాయి, నగారాలు మ్రోగుతుండగా, తదనుగుణంగా మహోబలోపేతమైన నృత్యం చేయటం కద్దు. ఇవేకాక, జలోరు జిల్లాలోని భిల్లుల నృత్యాలున్నాయి. వీనిలో అత్యంత ప్రచారంలో ఉన్న నృత్యం ఢోలు నృత్యం. ప్రతి నర్తకుడు, ఒక్కొక్క ఢోలు పట్టుకొని నృత్యం చేస్తూ వాయిస్తాడు. తక్కిన మరికొందరు నర్తకులు విచ్చుకత్తులను నోటితో పట్టుకొని నృత్యం చేస్తారు.

మినా తెగవారికి అభిమాన పాత్రమైన నృత్యం గేర్ నృత్యం, వీరు భిల్లులకు సంబంధించిన వారే. ఈ నృత్యాన్ని హోలీ పండుగలో చేస్తారు. నృత్యం వేగవంతమయ్యే కొలది నర్తకులు వలయాకృతులుగా ఏర్పడుతూ ఉంటారు.

భిల్లుల సంస్కృతికి ఘుమర్ నృత్యం ప్రాణప్రదమైనది. ఈ నృత్యంలో తప్పకుండా ప్రేమగీతమో, యశోగానమో, విషాద గీతమో అనుసరిస్తుంది. నృత్తాకారంలో ఒక అర్థ భాగంలో పురులు, మరొక అర్థభాగంలో స్త్రీలు ఏర్పడి, వలయాకృతిగా గమిస్తారు. ఘుమర్ అనే పేరుతోనే రాజస్థాన్‌లో మరొక నృత్యం ఉంది; అది వేరు, ఇది వేరు.



40. పై చిత్రం : గజన్ నృత్యం; పశ్చిమబెంగాల్

41. క్రింది చిత్రం: బౌల్ నృత్యం; పశ్చిమబెంగాల్





42. పై చిత్రం : మారియా నర్తకులు, బస్తర్; మధ్యప్రదేశ్
43. క్రింది చిత్రం : మారియా నర్తకులు, బస్తర్; మధ్యప్రదేశ్





44. పైచిత్రం : మారియా నర్తకుల వాద్యసమ్మేళనము, బస్తర్; మధ్యప్రదేశ్
45. క్రింది చిత్రం : గోండుల కర్మా నృత్యం; మధ్యప్రదేశ్





46. పై చిత్రం : ఖిల్ నృత్యం; రాజస్థాన్

47. క్రింది చిత్రం : ఘుమార్ నృత్యం; రాజస్థాన్



అది రాజస్థాన్‌లో, మరింత నాగరికసమాజంలో ప్రచారంలో ఉంది. పైగా, రాజస్థాన్‌లోని ధనికవర్గంలో ఆచారకర్మలకు సంబంధించిన నృత్యంగా వ్యాప్తిలో ఉందికూడా. భిల్లుల ఘుమర్ నృత్యం మరింత బలోపేతంగా ఉంటుంది. సన్‌సీల ఘుమర్ నృత్యమూ ఇదీ ఒకటే.

ఘేర్ ఘుమర్ నృత్యం సన్‌సీ తెగలలో ఎక్కువ ప్రాబల్యంలో ఉంది. స్త్రీ పురుషులు, ప్రారంభంలో వేర్వేరు వరుసలుగాఏర్పడి, నెమ్మదియైన గమనాలతో చలిస్తూ, ఆపిమ్మట, ఒక స్త్రీ తర్వాత ఒకపురుషుడు చొప్పున వలయ మేర్పడుతారు. క్రమంగా నృత్యవేగం పెరుగుతుంది. అప్పుడు ప్రతి వ్యక్తి తనచుట్టూ తానుతిరుగుతూ, వలయంలో తిరగటం జరుగుతుంది. ఈనృత్యంలో పిరుదుల సంచలనం ఒక ప్రత్యేక లక్షణం. నృత్యానికి వెనుక గాత్రవాద్యగానాదు లుంటాయి.

అజ్మీరులోని సన్‌సీలకు ప్రత్యేక జానపదనృత్యాలున్నాయి. రాజస్థాన్ శివారులో ఉండే సన్‌సీలకూ వీరికీ సంబంధంలేదు. ఐనప్పటికీ, వీరినృత్యంకూడా మిశ్రమ బృంద నృత్యమే. పండుగల సందర్భాలలో ఢోలక్, ఝులార్, అలోసాలు వాయిస్తూ ఉండగా ఈనృత్యం చేస్తారు. నృత్యం సాగుతూ ఉండగా, వేగంపెరుగుతూ ఉంటుంది. స్త్రీనర్తకుల ఆంగిక చాలనాదులు నమ్మజాలనంత వేగవంతంగాఉంటాయి.

మౌంట్‌ఆబూ లోయలో నివసించే గరాసియా లనబడే ప్రసిద్ధ గిరిజనుల నృత్యాలు, రాజస్థాన్ జానపద నృత్యాలలో కెల్ల అత్యంత మనోహరమైనవని చెప్పవచ్చును. ఈ నృత్యాలలో వాటి ప్రాకృతిక రూపంలో ఎలాంటిమార్పు రాలేదు.

వీనిలో ఒకానొక సహజమైన అద్భుతాకర్షణ ద్యోతకత మవుతుంది.

## గరసియాల వలార్ నృత్యం :

నక్షత్రరాత్రి, చంద్రుడు, పర్వతాలు, కల్లోల నదీ ప్రవాహాలవంటి ప్రకృతిసౌందర్యాలు వలార్ నృత్యానికి కథావస్తువులు. ఇవి, శృంగారభావాలను, కాల్పనికధోరణులను ద్యోతకం చేస్తాయి. పాటలలోని భావాలను, అర్థవంతమైన అభినయంద్వారా మనోహరంగా ప్రదర్శిస్తారు.

ఖయాల్ అనబడే నృత్యనాట్యాన్ని రాజస్థాన్ చక్కగా అలవరచుకొన్నది. ఇది 400 పండ్లుగా ఎడతెగని సాంస్కృతిక సంప్రదాయంగా వస్తున్నది. ఖయాల్‌లను సర్వసాధారణంగా జానపద నాటకబృందాలు ప్రదర్శిస్తూ, మారుమూల గ్రామాలకు వినోదాన్ని కల్పిస్తున్నాయి.

మధ్యయుగంలోని భూస్వామ్య వాతావరణంలో సాంఘిక నృత్యాలకు గౌరవం లేకుండా పోయింది. దీని పర్యవసానంగా, ప్రజ్ఞావంతులైన నర్తకులు తమతమ కులాల నుండి విడిపోయి, క్రమక్రమంగా భవాయ్ అని పేరుపొందిన స్వంత కులమునొకదానిని సృష్టించుకొన్నారు. 400 పండ్ల క్రిందట, ప్రసిద్ధ జానపద నర్తకుడైన నాగోజీజత్ అనే ఆయన భవాయ్‌కులాన్ని స్థాపించాడని అంటారు. విశిష్టమైన వేగం, అనేకరీతుల గతులు భవాయ్ నృత్యంలోని ప్రత్యేక లక్షణం. భవాయ్ కులస్థులు చిన్ననాటినుంచే నృత్యవిద్య నేర్చుకుంటారు. త్వరగా నృత్యవిద్యావేత్త లవుతారు. స్త్రీలు నాట్యం చెయ్యరు; స్త్రీలపాత్రలనుకూడా యువకులే ధరిస్తారు.

వీరిది ప్రధానంగా జానపదరీతి; వీరి నృత్య నాటకాలలో మత విషయాలు సామాన్యంగా ఉండవు. గ్రామీణ సమాజంగానీ ఢోల–మారూల పురాణ ప్రేమగాథగానీ, లేక సంప్రదాయంగావచ్చే చారిత్రక సంఘటనలుగానీ ఈ నృత్యాలకు ఇతివృత్తాలుగా ఉంటాయి. అక్కడక్కడ అసభ్యతకు చేరువగా కన్పించి నప్పటికీ ఈ నృత్యాలలో చాలా హాస్యం ఉంటుంది.

వర్షాకాలం ఐపోగానే; భవాయ్ నర్తకులు ఎనిమిది నెలలపాటు సంచారం బయలుదేరుతారు. తమ 'యజ్‌మాన్'లు (పోషకులు) ఉండే చోటికి చాలాదూరం ప్రయాణాలుచేసి, ఆ విధంగా బ్రతుకు తెరువు సంపాదించుకొంటారు.

కట్‌పుత్లి (బొమ్మలాట) నృత్యాలకు మన్వార్ పేరు పొందింది. కట్‌పుత్లివాలా, బొమ్మలను ఆడిస్తూఉంటాడు; అతనిభార్య ఢోలక్ (మద్దెల) వాయిస్తూ, కథ పాడుతుంటుంది. ఈ ప్రదర్శనం రాత్రివేళ జరుగుతుంది; సుమారు రెండు గంటలుపాటు టుంటుంది. రాజస్థాన్ కట్‌పుత్లివాలాలు, అస్సాం అంతదూరంకూడా వెళ్ళి, సాలుకు సరిపడ గ్రాసం సంపాదించుకొన్న మీదట తిరిగివస్తారు.

థార్ ఎడారిలో చాలా లోతట్టున సిద్ జాత్‌లు అనబడే బలిష్ఠ గిరిజనులున్నారు. వీరు గురుగోరఖ్‌నాథ్ అనుయాయులు. అద్భుత యోగక్రియలు చేయటంలో చాలా పేరుపొందారు. పెద్దమంటవేస్తారు. పెద్ద పెద్ద డోళ్ళు బూరలు వాయిస్తుంటారు. పాటపాడుతూ వుంటారు. అప్పుడు నృత్యం

జరుగుతుంది. సిత్ జాత్ లు కొందరు కలసి మంటలో దూకి దాదాపు ఒకగంటసేపు ఆనందాతిరేకంతో, ఎంతో మామూలురీతిగా నృత్యం చేస్తారు. గురుజస్‌నాథ్ స్మారకంగా మార్చి, ఏప్రిలు నెలలమధ్యజరిగే మేలా (ఉత్సవం) సందర్భంలో ఈ అగ్నినృత్యం జరుగుతుంది.

## తే రా తా పీ :

రాజస్థాన నృత్యాలలో తేరాతాపీ నృత్యం చాలా కష్టతరమైనదైనా మనోరంజకమైన బృంద నృత్యం. ఇందులో పాల్గొనే ముగ్గురు పురుషులలో ప్రతి ఒక్కరూ ఒక్కొక్క ఎక్ తార (ఏక తంత్రీ వాద్యం) చేతితో పట్టుకొని వుండగా ముగ్గురు స్త్రీలు పదమూడు మంజీరాలను (చిరుగంటలు) శరీరముపై అక్కడక్కడ కట్టుకొని, తలలపైన ఇత్తడి బిందెలను నిలిపి ఉంచుతారు. ఈ విధంగా తయారయి, నర్తకులు, ధాన్యము విసురుట మొదలైన వానిని సూచించే అభినయం చేస్తూ ఉంటారు. వీరి నృత్యానికి రామదేవ భక్తులైన 'కమాద్'లు బృందగానం చేస్తారు.

## కు చ్చి ఘో ్రి :

రాజస్థాన నృత్యాలలో ఒకటైన కుచ్చి ఘోడ్రి ఈ రాష్ట్రంలోని తూర్పు ప్రాంతాల్లో చాలా ప్రచారంలో ఉంది. ఈ ప్రాంతంలోని వెనుకబడ్డ తరగతులైన బావరియాలు, కుంహారులు, సైగరలు ఈ నృత్యం చేస్తారు.

దీనిపేరు సూచించిన రీతిగా ఈ నృత్యం గుఱ్ఱపు స్వారిని ప్రదర్శిస్తుంది. ఇందులో ఉపయోగించే గుఱ్ఱాన్ని

రెండు చిన్న వెదురు కఱ్ఱలతో చేస్తారు. రెండు చివరల రెండు బుట్టలు కడతారు. అందంగా తయారు చేసిన గుఱ్ఱపు తలను ఒక బుట్టకూ మరొక బుట్టకు అవిశనార కట్టను కడతారు. నర్తకుడు వదులు వదులు దుస్తులు వేసుకొని పెండ్లి కొడుకులా ముస్తాబవుతాడు. ఒక చేతితో కత్తి పట్టుకొని గుఱ్ఱాన్ని నడుముకు కట్టుకొంటాడు. నిజంగా గుఱ్ఱాన్ని ఎక్కి ఉన్నాడా అన్నట్లు కట్టుకొంటాడు.

ఈ నృత్యం ఎక్కువగా పెండ్లిండ్ల సమయాల్లో చేస్తారు. దీనిలో ఏక సమయంలో నలుగురు మొదలు ఐదుగురు నర్తకుల వరకూ పాల్గొంటారు. 'డోల్', 'తుసుహి' వాద్యాలు ఈ నృత్యాన్ని అనుసరిస్తాయి.

రాజస్థానులోని సాంఘిక నృత్యాలలో, రాస, ఘుమాల్ నృత్యాలు అత్యంత ప్రజానురక్తి పొందినవి. పూర్వకాలపు రాజస్థాన్ సంస్థానాలనేలిన రాజులకు, ఘుమూర్ నృత్యానికి సంబంధం వుంది. మహారాణుల చెలికత్తెలు అనేక వేడుక సమయాల్లో ఈ నృత్యాన్ని చేస్తూ ఉండేవారు. హోలీ, దీపావళి వంటి పండుగల్లో కూడా ఈ నృత్యం చేయబడుతూ ఉండేది. ఇది ప్రధానంగా స్త్రీలు చేసే నృత్యం. ఇందులో ఎంతమంది అయినా పాల్గొనవచ్చు. నృత్యగతులు చాలా సరళంగా ఉంటాయి గనుక ఇందులో పాల్గొనేవారు వలయాకారంగా లయాన్వితంగా కదులుతారు. సర్వసాధారణంగా ఈ నృత్యాన్ని అనుసరించేది ఒక్క పాట మాత్రమే.

ఉదయపూర్, జోద్‌పూర్, కోటాలలో మూడు విభిన్నరీతుల ఘమూర్ నృత్యం వ్యాప్తిలో ఉంది. దీనిలోని

ఒక రీతిలో పురుషులు కూడా పోల్గొని స్త్రీలతో కలిసి జతలుజతలుగా నృత్యం చేస్తారు. జోద్‌పూర్ లోనూ, బికనీర్ లోనూ, రాజస్థానులోని మరికొన్ని దూరపు ప్రాంతాల లోనూ ఘుమార్ నృత్యం రాచకుటుంబాలకు, ధనికవర్గానికీ మాత్రమే పరిమితమై ఉన్నదని చెప్పబడుతున్నది.

గాగీ నృత్యానికి మత సంబంధమైన ఉపాధి ఉంది. ఇది చెడ్డతనముపై మంచితనపు గెలుపును ప్రదర్శిస్తుంది. భిల్లుల దైవమైన భైరవుని జీవిత చరిత్రను ఇది చిత్రిస్తుంది. వర్షర్తువులో ఈ నృత్యం చేస్తారు. ఇది నృత్యనాటకం; బారో జీవితంలోని అనేక దృశ్యాలూ, ఉదంతాలు ఇందులో ఉంటాయి. దుస్తులు నిరాడంబరంగాను, సార్థకంగాను ఉంటాయి. గతులు వీర్యవంతంగాను, ఆకర్షణీయంగాను ఉంటాయి.

రాజస్థాన్ నృత్యాలలో ధరించే వేషాలు—అవి ఆదిమవాసులకు చెందిన నృత్యాలు గానీ, పట్టణ సమాజానికి చెందిన నృత్యాలు గానీ—రెండింటికీ సమాన ధర్మాలు కొన్ని ఉన్నాయి. బాగా దగ్గరకు చేర్చి ఉన్న ఘాఘ్రా (పావడా) రాజస్థానులోని అందరు గిరిజనులకు, కులాలకు సమానమే. ఒకప్రాంతానికీమరొకప్రాంతానికీ పావడా తీరులోమార్పు ఉంది. ఉపయోగించే గుడ్డలోకూడా తేడా కనుపిస్తుంది. ఐతే నిండురంగుల అద్దకాల గుడ్డలు అన్నిటికీ ఒకటే. స్త్రీలు పొడవు చేతుల చోళీలు ధరిస్తారు. అందంగా అద్దకాలు వేసిన ఎరుపు, పసుపు దుప్పటాలు పెద్ద పెద్దవి వేసుకుంటారు. వెండి ఆభరణాలు, బంగారు ఆభరణాలు, ధరిస్తారు—భిల్లు జాతులవారు

వెండి ఆభరణాలు ధరిస్తారు; ధనికవర్గానికి చెందిన నాగరక స్త్రీలు బంగారు ఆభరణాలు ధరిస్తారు. తలకు పెట్టుకొనే ఆభరణాలలో విలక్షణమైనది బోర్లా ఆభరణం. ఇది బంగారంతో చేస్తారు; రాళ్ళు పొదిగి ఉంటాయి. దీనిని ఫాలం మధ్యలో ధరిస్తారు.

పురుషులు ధరించే విలక్షణమైన వేషం ఇది; దట్టించికట్టే ధోవతి, పొడవు చేతుల బందీసు. ఇవి ఒక ప్రాంతానికీ మరొక ప్రాంతానికి మారుతూ ఉంటాయి. ఒక్క భిల్లు నృత్యాలలో తప్ప రాజస్థాన్‌లోని అన్ని వర్గాలలోనూ యథార్థానికి యిది సర్వసామాన్యమైనది

**ఉత్తర ప్రదేశం:**

ఉత్తరప్రదేశంలోని హిమాలయ ప్రాంతపు నృత్యాలను గూర్చి ప్రత్యేకంగా కుమాన్ ప్రాంతపు నృత్యాలను గురించి మనం ముందే చెప్పుకొని ఉన్నాము. ఉత్తరప్రదేశ సాంఘిక కులాల జానపద నృత్యాలకున్నూ, అందులో ప్రత్యేకంగా లక్నో, కాశి, కాన్పూరు మొదలైన చోట్ల నివసించే కులాల జానపద నృత్యాలకున్నూ కుమాన్, హిమాలయ ప్రాంతపు గ్రామాలలోని నృత్యాలకున్నూ చాలా తేడా ఉంది. మైదాన ప్రాంతంలో, నృత్యం ప్రత్యేకంగా, మరీ శాస్త్రీయ రీతిని సంతరించుకొని, కథక్ అనబడే శాస్త్రీయ నృత్యానికి దారి తీసింది. ఈ రాష్ట్రాలలోని మహారాజుల, నవాబుల దర్బారులలో కథక్ నృత్యం వర్ధిల్లుతూ వచ్చింది. ఇదే కాలంలో, గ్రామీణ ప్రజలలోనూ పేద ప్రజలలోనూ, ఆదిమ నృత్యగుణాలు కొన్ని సంతరించుకొన్న

నృత్య, నాట్య రూపాలు కొనసాగుతూ వచ్చినవి. అయితే వీనిలో కూడా కథక్ శాస్త్రీయ రీతులు కొన్ని ఉండనే ఉన్నాయి.

మధుర, బృందావనాలు కేంద్రాలుగాగల పురాతన వ్రజభూమిలో కృష్ణ-రాధ-గోపికా భక్తి మతం వ్యాప్తిలో ఉంది. ఇది భారతదేశ మంతటా అనేక జానపద గేయాల ద్వారానూ, నృత్యాలద్వారానూ ప్రదర్శించ బడుతూఉంది. సహజంగానే ఈ ప్రాంతంలో అత్యంత ప్రజాదరణీయమైన నృత్యాలు రాసలీల పరంపరఅని చెప్పవచ్చును. ఇవి, కృష్ణుని బాల్యాన్ని, ప్రౌఢ జీవితాన్ని, గోపికలతో ఆయన నెరపిన వినోద చేష్టలను, రాధపై గాఢ ప్రేమను ప్రదర్శిస్తాయి. వీనిలో గతులు సంకీర్ణంగా ఉండి, అభినయం కళామయం గానూ, సంగీతం ఆహ్లాదపూర్ణంగానూ ఉంటాయి. పాద గతులు ఎక్కువగా కథక్ రీతిని పోలిఉన్నా, శాస్త్రీయ బాణీలు తక్కువ.

హోలీ, దోల్-జాత్ర పండుగలలో, బ్రిజ్ జిల్లాలలోని స్త్రీలు ఎక్కువగా నృత్యాలు చేస్తారు. ఈ సందర్భాలలో ప్రదర్శించే నృత్యాలు, ఈ ఉత్సవాలలోని ఔత్సాహిక భావాన్ని వ్యక్తం చేస్తాయి. ఈ పండుగలలో రంగునీళ్ళు గాని, లేక ఎరుపు, పసుపు రంగుల పొడినిగానీ విశేషంగా చల్లుకొంటారు. అందరూ పాడుతూ ఆడుతూ, ఆనందంగా ఉంటారు.

నౌతంకీ నృత్యం సంప్రదాయ రీతికి చెందినదైనా, ఇది ఆ ప్రాంతంలో ప్రజాభిమానం చూరగొన్న నృత్య

రూపాలలో ఒకటి. ఇది ఒకరీతి నృత్యనాటకం; సంగీత రూపక రీతిగా దీనిలో సంగీత వ్యాఖ్యానాన్ని గానం చేస్తుంటారు. ఈ పాటలను, నృత్యాలను అనుసరించి పాడే గాన ఫణితులు ప్రజలలో అత్యంత ప్రచారంలోఉన్న గాన రూపాలనుంచి సంతరించినవి. వీనిలోని ఇతివృత్తాలు, మత సంబంధమైన పురాణ గాధలలోని సురాసుర శక్తుల సంఘర్షణము మీదగాని, లేక, చారిత్రక గాధలలోని వీర కృత్యాలమీదగాని ఆధారపడి ఉంటాయి. నౌతంకి నర్తకులు తరచు, సాంఘిక జీవితంలోని ప్రతిదిన సమస్యలనుగాని లేక భగత్ సింగ్ వీరమరణంవంటి దేశాభిమాన కథలను గాని ప్రదర్శిస్తారు. నౌతంకి నృత్యాలను నేటికీ జానపద నాటక సమాజాలవారు ప్రదర్శిస్తున్నారు. కాని, ముఖ్యంగా సినిమా ద్వారా వచ్చిన, వినాశకరమైన ఆధునిక ప్రభావం చేతను, దానిని సరిగా అవగతం చేసికొనని కారణంగానూ ఈ నృత్యాలలోని పూర్వపు పరిపుష్టి, కళాపుష్టి కొంతవరకు దెబ్బతిన్నాయి. ఇప్పుడు ప్రదర్శింప బడుతున్న నౌతంకి నృత్యంలో పూర్వపు నౌతంకి నృత్యపు ఛాయలుకూడా లేవు. పూర్వపు నృత్యం పట్టణాల లోని పేదప్రజల వినోదాని కుద్దేశించ బడింది. ఇప్పుడది వారిని నీతిభ్రష్టులుగా మాత్రం చేస్తున్నది. ఇది స్వచ్ఛమైన తన జానపద స్వభావాన్ని కోల్పోయి,అసభ్యతకు ఆలవాలమైంది.పూర్వకాలపునౌతంకికి సంబంధించిన నగారా వాద్యం మాత్రం మిగిలివుంది; దానిని భ్రష్టం చెయ్యటానికి కాబోలు హార్మోనియము, తబలా జత చేయబడ్డాయి.

తొలకరితో కట్రీ ఋతు వారంభమై తనతో ఎంతో అందాన్నీ ఆనందాన్ని తెస్తుంది. తూర్పునుంచి వచ్చే చల్లని వానజల్లులతో భయంకరమైన వేసవివేడి తగ్గి హాయి చేకూరుతుంది. గ్రామీణ స్త్రీలు, వర్ష ఋతువులో, ఝూలా (ఊయెల) పాటలను మహా పారవశ్యంతో పాడుతారు; ఈ పాటలు వారి ఆనంద పారవశ్యాన్ని వ్యక్తం చేస్తాయి. కొందరు ఊయెలల మీద పైకీ క్రిందికి ఊగుతూ ఉంటే, మరికొందరు, వాన జల్లులతో తడిసిన నేలపై ఉల్లాసంగా నృత్యం చేస్తూ, నవ జీవనం అంకురిస్తున్న సువిశాలక్షేత్రాలనుగూర్చి, రోజురోజుకు పచ్చబడే పచ్చగడ్డిని గూర్చి, ఒక్కొక్క వానజల్లుకు మరింత పెరుగుతూ ఉండే పంటచేలను గురించీ పాటలు పాడుతారు.

ఆహీరుల నృత్యం చెప్పతగిన ఉదాహరణ: ఎందుకంటే, కృష్ణుడు ఈ ఆహీరులలో పుట్టినట్లు చెప్తారు. శిశు జనన సందర్భంలోనూ, వివాహ సందర్భాలలోనూ జరిగే వేడుకలలో, ఆహీర జాతిలో, ఈ నృత్యం ప్రదర్శించబడుతుంది. దీనిలో ఢోలక్, కంసీ (తాళము)లు వాయిస్తారు. అంతటా ఘుంఘ్రూలు (చిరుగంటలు) కట్టిన పొట్టి బిగుతు జుబ్బాలను ఈ నర్తకులు ధరిస్తారు. నడుముచుట్టూ ఘుంఘ్రూలు కట్టిన పట్కాలు కట్టుకొంటారు. చేతులకు కడియాలు, మెడకు కంటెలు పెట్టుకొంటారు. సంకీర్ణమైన పాద గతుల సౌందర్యం ఘుంఘ్రూల మ్రోతలతో ద్విగుణీకృతమవుతుంది.

'కహారవ' గీతం పరిపుష్టమైనది; ఇది కహార్ జాతి సొత్తు. మనోహరమైన వీరి ప్రత్యేక నృత్యాలు కనుల పండుగగా ఉంటాయి. ఈ నృత్యాలకు ఈ పాట ఆధారం. పాట అందరూ కలిసి పాడుతూంటారు; ఒకగొంతు ముందు నడుస్తూ ఉంటుంది; పాడేటప్పుడు కొన్ని డోళ్ళు, కర్తాళాలు (తాళాలు) వాయిస్తారు. కహార్ నృత్యం శక్తి సంపన్నం గానూ, భావపరిపుష్టంగానూ కూడా వుంటుంది. నృత్యం పరాకాష్ట నందుకునే సరికి, వలయగతుల ఉద్ధృతం పెరుగు తుంది: సహజంగా చాలా స్వచ్ఛమైన ఈ నృత్యరూపంలో, ప్రేక్షకులను నవ్వించటం కోసమని దురదృష్ట వశాత్తు, తరచు అసభ్యమైన అభినయం చేర్చటం జరుగుతున్నది.

ఛమార్ (చర్మకారులు లేక చెప్పులు కుట్టేవారు)ల నృత్యాలు హాస్యమయమైన గేయరూపక పద్ధతిలో రూపొంది నవి. సామాన్యంగా ప్రాచీన గాథలు, మత గాథలు ఈ నృత్యాలలోని ఇతివృత్తాలు. అయితే, దానిని పొందుపరచ టంలో ఆ ప్రాచీన వాతావరణం వుండదు. కాబట్టి, వేళా కోళానికీ, వెక్కిరింతలకూ ఎక్కువ అవకాశం ఏర్పడింది. ఈ హాస్యం మహా చురుకుగా, రుచికరంగా వుంటుంది.

హాస్యం, అణచివేయబడిన జాతుల నృత్యాలలోని ప్రత్యేకత అని చెప్పవచ్చు. సర్వసాధారణంగా ఇది, తమను హింసించే వారిని గూర్చిన వ్యంగ్య సాంఘిక హాస్యరూపంగా వుంటుంది. సాంఘిక అన్యాయాలను ఎదిరించే ఫలప్రదమైన ఆత్మరక్షణోద్యమంగా ఇది ఉపచరిస్తున్నది.

# 4. పశ్చిమ ప్రాంతము

## సౌరాష్ట్ర, గుజరాత్, మహారాష్ట్ర :

భారత దేశపు పడమటి కోస్తాలో ఉన్న ఈ ప్రాంతపు జానపద నృత్యాలు, దేశంలోని జానపద నృత్యాలలో కెల్ల సుసంపన్నమైనవీ, కష్టసాధ్యమైనవిన్నీ. తూర్పు రాష్ట్రాలయిన బెంగాల్, ఒరిస్సా, బీహార్ ల నుండి పడమటి రాష్ట్రాలయిన సౌరాష్ట్ర, గుజరాత్, కథియవార్, మహారాష్ట్రలకు వచ్చే టప్పటికి, సాంఘికనృత్యాల, జానపదనృత్యాల రూపం చాల వరకు మారిపోయినట్లు, మణిపూర్, సంతాలీల సుందర మంద నృత్యాలకూ వీనికీ పోలికే లేనట్లు మనకు తోస్తుంది. మణిపూరు, బెంగాలులలోని మధుర ప్రకృతిగాక, ఇచట సముద్రమూ సముద్రతీరమూ ఉండటంచేత కాబోలు ఇచటి నృత్యాలు వీర్యసంభరితంగానూ, పొంకంగానూ ఉంటాయి. ఇవి కొంతమట్టుకు రాజస్థాన్, మధ్యప్రదేశ్ నృత్యాలను పోలివుంటాయని చెప్పవచ్చు. సౌరాష్ట్రనృత్యాలలో ఎడారి ప్రభావం స్పష్టంగా ద్యోతక మవుతుంది. సౌరాష్ట్ర, మహారాష్ట్ర, గుజరాత్ నృత్యాలు మూడిటిలోనూ రాసనృత్యం వుంటుంది. ఈ ప్రాంతాలలోని రాసనృత్యాల వైవిధ్య సంపదకు భారత దేశంలోని ఇతర ప్రాంతాలేవీ ఈడురావు.

కృష్ణభగవానుని జీవితగాథలే రాసనృత్యాలకు మూలమని చెప్పవచ్చు. బృందావన సంప్రదాయపు పవిత్రరీతి,

రాసనృత్యములోని విలోలగతుల సునిసిత రీతులలో ప్రతిధ్వని స్తున్నది. వసంతపంచమి, వసంతావాహనము, నవరాత్రాలు, శక్తి పండుగ, శారద పూర్ణిమవంటి ఇంకా అనేక ఇతర పర్వదినాలలో రాసనృత్యం చేస్తారు. ఐతే, సౌరాష్ట్రి రాస నృత్యాలకున్నూ, మణిపూర్‌లో మనంచూచే రాసనృత్యాల కున్నూ, చాలా తేడాఉంది. మణిపూర్ రాసనృత్యాలలో రాధాకృష్ణ గాథ ప్రాధాన్యం వహించుటేకాక పరమాత్మ కోసం జీవాత్మపడే తాపత్రయము సంకేతము చేయబడింది. మణిపూర్‌లో ప్రచారంలోఉన్న ఐదురకాల రాసనృత్యాలలో కూడా గోపికాకృష్ణుల గాథయే ఇతివృత్తము. కాని, సౌరాష్ట్రి రాసనృత్యాలలో పురుషులే పాల్గొంటారు. మణి పూరు రాసనృత్యాలు కేవలం శృంగారమయమై ఉంటే సౌరాష్ట్రి రాసనృత్యాలలో అట్లుగాక గోపికల బదులు శ్రీకృష్ణ గోపాలకుల గాథ ఇతివృత్తంగా ఉన్నది. ఈ నృత్యాలకున్నూ మణిపూర్‌లోని రాఖాలు నృత్యాలకున్నూ కొంత పోలికఉన్నది. కోలాటపు కర్రలతోనూ అవి లేకుండా కూడా చేసే వల్లినృత్యాల సంకీర్ణరీతులలో సౌరాష్ట్రి, గుజరాత్ రాసనృత్యాల రూపాలు గోచరిస్తాయి.

సౌరాష్ట్రి రాస నృత్యాలలో కెల్ల ఆకర్షణీయమైన ప్రసిద్ధ నృత్యం దాండియా రాసనృత్యం. గుజరాతు గార్బా-రీతితో ఈ నృత్యంచేస్తారు. దీనిలో నర్తకులు, మువ్వలుకట్టిన కోలాటపు కర్రలు పట్టుకొని కోలాటం వేస్తారు. కోలాటపు కర్రలు ఒకదానిపై ఒకటి కొట్టినప్పుడల్లా గజ్జెలు గల్లుగల్లున మ్రోగుతుంటాయి. ఈ నృత్యంలోని లయ రీతి చాలా సంకీ

రంగా ఉంటుంది. నృత్యం నెమ్మదిగా ఆరంభమవుతుంచి, క్రమంగా నృత్యవేగం హెచ్చుతుంది. నృత్య వలయంలోని ప్రతివ్యక్తి కోలాటం వేస్తూ తానంత తాను నృత్యం చేయటమే కాక తనకు ఇరువైపులా, అభిముఖంగానూ, వలయంలో ఉన్న నర్తకులతో కలసి సంకీర్ణానుబంధాలతో నృత్యం చేస్తాడు. ఒక్కొక్కప్పుడు ఈ నృత్యవలయం రెండు వలయాలుగా విభక్తమై ఒకదానిలో ఒకటి ఉండేట్లు ఏర్పడటం కద్దు. మరికొన్ని సందర్భాలలో విశాలచక్ర రేఖపై మూడు లేక నాలుగు వలయాకృతులుగా ఏర్పడటం కద్దు. ఈ వలయాకృతులలో నృత్యగతులు చాలా స్వేచ్ఛగా ఉంటాయి. నిలచిన, కూర్చున్న, పడుకున్న భంగిమలలో కోలాటంవేస్తారు. అప్పుడప్పుడు యించుమించు వలయాకారపు రజ్జురీతిగా పురుషనర్తకులు నేలపై పరుండిచేతులెత్తి కోలాటం వేస్తారు. ఒక్కొక్కప్పుడు చేతులకు బదులు కోలాటపు కర్రలను కాళ్ళతో పట్టుకొనడం కూడా కద్దు. దాండియా రాసనృత్యం చాలా పురాతనమైనదని నిస్సందేహంగా చెప్పవచ్చు. కొన్ని సంస్కృత నాటకాలను పట్టిచూస్తే ఇది ఆ కాలంలో భారతదేశమం దంతటా ప్రచారంలో ఉన్న సర్వసామాన్యమైన నృత్యక్రీడా రీతియని తోస్తుంది. ఇలాంటి నృత్యం రాజశేఖరుని 'కర్పూరమంజరిలో' కూడా ఉదహరించబడింది.

సౌరాష్ట్రంలో ప్రచారంలోఉన్న వివిధరూపాల దాండియా రాసనృత్యాలేకాక టిప్పని నృత్యంవంటి యితర నృత్యాలుకూడా ఉన్నాయి. సౌరాష్ట్ర నారీజనంచేసే ప్రసిద్ధ

నృత్యమిది. ఇది కార్మిక ఇతివృత్తంమీద ఆధారపడి ఉంటుంది. ప్రాతకాలపు తరహా యిళ్ళ నిర్మాణంలో నేల గట్టిగా నునుపుగా దట్టించే పనిలో నియమించబడిన కూలీ స్త్రీలు దీన్ని చేస్తారు. ఈపని చేయటానికి వాళ్ళు దిమ్మెస ఉపయోగిస్తారు. దిమ్మెసల కర్రచివర ఘుంఘ్రూలు కడతారు, ఈ నృత్యంలో నర్తకులు వలయాకారంగా తిరుగుతూ మేళవిత గమనాలతో నేలను చదును చేస్తారు.

సౌరాష్ట్రంలో కేవలం ఆచారకర్మలకు సంబంధించిన నృత్యాలు, భక్తినృత్యాలుకూడా ఉన్నాయి. శివదేవునకు అంకితమైన గజే నృత్యం ఇట్టి నృత్యాలలో ఒకటి. దక్షిణ సతారాజిల్లాలలోని గ్రామ ప్రజలలో ఇది ఎక్కువ ప్రచారంలోఉంది. సమ్మోహనకరమైన సంగీత లయ కనుగుణంగా చేతి రుమాళ్ళను ఊపుతూ నర్తకులు ఆనంద పారవశ్యంతో నృత్యం చేస్తారు. నృత్య పురోగమనంతోపాటు డోళ్ళూ, సన్నాయీ, తాళాలూ కలసి సంగీత ఆరోహణాన్ని సృష్టిస్తాయి.

సౌరాష్ట్రలోని మత్స్యపారిశ్రామికుల ప్రత్యేక నృత్యం 'పధర' నృత్యం. దీనిలో నర్తకులు వలయాకృతులలోనూ, అర్ధవలయాకృతులలోనూ నృత్యంచేస్తారు. నర్తకుల సముద్ర మత్స్యపారిశ్రామికుల జీవితాలను అభివ్యక్తం చేస్తూ అభినయిస్తూ బలవత్తరమైన గతులను ప్రదర్శిస్తారు.

మహారాష్ట్ర, బొంబాయి ప్రాంతాలలో మత్స్య పారిశ్రామికుల నృత్యా లనేకం ఉన్నాయి. ఈ ప్రాంతంలోని జానపద నృత్యాల ప్రత్యేకతను ఇవి వ్యక్తం చేస్తాయి.

నారికేళ దిన నృత్యం అనేది తొలకరి నృత్యం. వర్షాలు, భీభత్సంగా గర్జించే సముద్రము ఉపాధిగా ఉండగా పల్లెకారులు ఈ నృత్యం చేస్తారు. నారికేళ దినాన సముద్ర దేవుని పూజిస్తారు. పల్లెకారులు "ఓసాగరా (సముద్రుడా), శాంతించుము, మా కవిల (చేపలనుపట్టే వలల గడలు)ను ఎగురవేయనిమ్ము" అని పాడుతూ నృత్యం చేస్తారు. సముద్ర కుమారులైన వీరి భక్తికి మెచ్చి సాగరదైవము ప్రశాంతుడవుతాడు.

బాగా చేపలు పట్టినతరువాత గాలి నిస్తబ్దమైపోగా సముద్రపుటొడ్డుకు పల్లెకారులు మరలి రావటాన్ని మల్హారి నృత్యం ప్రదర్శిస్తుంది. పల్లెకారులు తమ మల్హారదైవాన్ని ప్రార్థిస్తారు. వారి ప్రార్థనము విని ఆ దేవుడు వాయు రూపుడై వారిని రక్షిస్తాడు. వారు ఒడ్డుచేరి మహోత్సాహంతో నృత్యం చేస్తారు.

### హోలీ నృత్యం:

హోలీరోజున పల్లెకారులు తమ స్త్రీజనాలతోకూడి, 'హుటపాని' అనబడే హోలీమంటచుట్టూ నృత్యం చేస్తారు. క్రొత్తగా పెండ్లాడిన ఆలుమగల జంట ఒకటి ఈ భక్తి నృత్యంలో వీరితో చేరుతుంది.

సౌరాష్ట్రిలో మనం చెప్పుకొన్న రాసనృత్యాలూ, గుజరాత్, మహారాష్ట్రి రాసనృత్యాలూ ఒకటే. రాస నృత్యాలు సౌరాష్ట్రి, మహారాష్ట్రి, గుజరాతులలో అంతట ప్రదర్శించబడుతున్నాయి. ప్రస్ఫుటమైన కొన్ని ప్రాంతీయ



48. పైచిత్రం : దాండియారాస; రాజస్థాన్

49. క్రింది చిత్రం : కఛీఘోడీ నృత్యం; రాజస్థాన్





50. పైచిత్రం : భాంగ్రా నృత్యం; పంజాబ్

51. క్రింది చిత్రం : దాండియా రాస; సౌరాష్ట్ర





52, పై చిత్రం : దాండియా రాస, ద్వితీయరీతి; సౌరాష్ట్ర

53. క్రిందిచిత్రం : దాండియా రాస, తృతీయరీతి; సౌరాష్ట్ర





54. పై చిత్రం : తిప్పని నృత్యం; సౌరాష్ట్ర
55. క్రింది చిత్రం : గర్బానృత్యం; గుజరాత్



భేదాలను మినహాయిస్తే, ఈ ప్రాంతా లన్నిటిలోనూ ఇవి ఒకేమాదిరిగా ఉంటాయి.

అయినప్పటికినీ గుజరాతు గర్బానృత్యం, గుజరాతు జానపద నృత్యాలలో చాలా విలక్షణమైనది. సౌరాష్ట్ర, మహారాష్ట్ర రాసనృత్యాలకూ దీనికి చాలా తేడా ఉంది. గుజరాతులోని నృత్యాలలోకెల్ల సుప్రసిద్ధమైనది గర్బా. ఇదే పేరుగల అనుసరణగీతం పాడుతూ ఉండగా ఈ నృత్యం చేస్తారు. నవరాత్రి ఉత్సవకాలంలో గర్బీఘటాన్ని ప్రతి యింటా పూజా పురస్కారాలతో నెలకొల్పుతారు. ఆకర్ష ణీయమైన నమూనాలు కుంభంమీద రచిస్తారు. లోపల జ్యోతి వెలిగిస్తారు. గ్రామీణ కన్యకాజనం తమ తమ గర్బీలను తలలపై పెట్టుకొని యింటింటికీ వెడతారు. ఆయా యిండ్ల యిల్లాండ్రు ముందు నడువగా ఆ యింటి గర్బీచుట్టూ నృత్యం చేస్తారు. తరవాత వారికి మిఠాయిలు పెడతారు. ఈ బృంద నాయకురాలు పాట మొదటి చరణాన్ని పాడుతుంది. దానినే తక్కిన అందరూ పాడుతూ చేతులుచరుస్తూ తాళం వేస్తారు. అడుగు అడుగుకీ మహాసుందరంగా ప్రక్క లకు వంగుతూ, సుందరాభినయంతో హస్తాలను జోడించి, క్రిందికి, మీదికి, ఇరుప్రక్కలకుఊపుతూ చప్పట్లు చరుస్తారు.

సౌరాష్ట్రలో ఎన్నిరకాల దాండియా రాసనృత్యాలున్నాయో గుజరాత్‌లోని గర్బానృత్యాలలోనూ అన్నిరకాలున్నాయి. గర్బాగానాలనేది ఒక పండుగ; దీనిలో కుల భేదం, సాంఘికహోదాల తారతమ్యాలతో నిమిత్తంలేకుండా అందరూ పాల్గొనవచ్చును. ఢోలక్ వాద్యము, స్త్రీలగాత్ర

సంగీతమూ దీనికి అనుసరణ గానం చేకూరుస్తాయి. గర్బా పాటలు చాలామట్టుకు చాలా పురాతనకాలపువి. ఇవి అనేక తరతరాలుగా ఆనోట ఆనోట వస్తున్నాయి. వీనిలో ఎక్కువ పాటలు చాలా అందమైనవి కావటంచేత, వివిధరీతుల గర్బా జానపదగేయాలు, గర్బా జానపదనృత్యాలూ సేకరించటానికి ఇటీవల బొంబాయిలో ఒక ప్రయత్నం జరిగింది. గుజరాతులో ప్రచారంలోనున్న గర్బా రీతులనన్నిటినీ సమీకరించే ఉద్దేశ్యంతో కడచిన రెండు మూడేండ్లుగా ప్రత్యేకంగా గర్బా ఉత్సవం ఏర్పాటు చేయబడింది.

మహారాష్ట్రలో, గర్బా, దాండియా రాసనృత్యాలు రెండూ ప్రచారంలో ఉన్నాయి. అయితే, ఇవియేకాక మహారాష్ట్ర ప్రత్యేకతను తెలిపే కొన్ని భక్తి నృత్యాలు, గిరిజన నృత్యాలు కూడా మనకు కన్పిస్తాయి. పల్లెకారుల నృత్యాలలో ఎక్కువ ప్రసిద్ధమైనది కోలీ పల్లెకారుల నృత్యం. పల్లెకారులు, బొమ్మకారులను చేతులతో పట్టుకొని, రెండు వరుసలుగా నిలచి, ఏకకాలంలో, ముందుకు వెనుకకు ఊగుతూ పడవకు తెడ్లువేస్తున్న గతిని అభినయిస్తూ,సముద్రపుటలలపై పడవ శబ్దంచేస్తున్నట్లు నాటకీయ భ్రాంతిని కల్పిస్తారు. పల్లెకారుల స్త్రీలుకూడా వరుసలలో నిలువబడి, చేతులు చేతులు లంకెలు వేసుకొని పురుషులవైపు నడుస్తారు.

అటు తరువాత వేర్వేరు వరుసలనుండి చెదిరిపోయి, అందరూ కలసి, నృత్యం చేస్తారు. సముద్రోపరితలాన్ని, సముద్రపుటొడ్డుకు కొట్టుకొని అలలు విచ్ఛిన్నం కావటాన్ని ఒక కొండకొమ్మనుండి మరొక కొండకొమ్మ దగ్గరకు పడవ

నడపటాన్ని, చేపలను పట్టటానికి వలలెత్తటాన్ని సంకేతిస్తూ నృత్యం చేస్తారు. వాళ్ళ పాటలు, వాళ్ళ నిత్యజీవితంతోనూ సముద్ర వికారాలతోను అతి సన్నిహితంగా ఉంటాయి. పాట పల్లవి సర్వసామాన్యంగా ఇలా ఉంటుంది: "పొట్ట కూటికోసం సముద్ర గర్భాలను, ఆకాశపు కప్పును తాకినాము; పొట్టకూటికోసం చేపలు పట్టటానికి లేచి ఉంటూ దీర్ఘరాత్రులను గడిపినాము. ఈ విధంగా, ఓ సముద్రదేవా! నిన్నారాధిస్తున్నాము."

ఇంతకంటే కొంచెం నాగరకభావాన్ని పొందిన మహారాష్ట్ర నృత్యాలలో దీపక నృత్యం సుప్రసిద్ధమైనది. భక్తిగీతాలు పాడుతూ, చిత్రవిచిత్ర వాద్యాలు వాయిస్తూ ఉండగా, ఖండోబా దైవభక్తులు ఈ నృత్యం చేస్తారు. ఈ నృత్యంలోని అచ్చెరువు గొలిపే ప్రత్యేకత ఏమంటే, కుటుంబ నర్తకులు, తాము నృత్యం చేసేటప్పుడు, వెలుగుతున్న దీపాలను, తలలమీద, భుజాలమీద, చేతులమీద నిలుపుకొంటారు. ఈ మండుతున్న ఈ దీపాలతోనే సంకీర్ణ లయాన్వితమైన గతులను ప్రదర్శిస్తారు. వీనిలో కొన్ని గతులను చూస్తూంటే రోమాంచంకలిగే టట్లుంటాయి. ఇలాంటి మరొక నృత్యం హోలీనృత్యం. ఈ నృత్యం కర్మలకు సంబంధించినదీ, సాంఘికమూ కూడాను. దీనిలో స్త్రీ పురుషులు కలసి నృత్యం చేస్తారు. ఢోలు, ఇత్తడిపళ్ళాలు, గాత్రసంగీతం, ఈ నృత్యానికి అనుసరణ గానం సమకూరుస్తాయి. ఈ నృత్యం దీపక నృత్యంకంటె శక్తివంతంగా ఉంటుంది.

క్రీడలుగా వర్గీకరింపతగిన ఇతర ముఖ్య జానపద నృత్యాలెన్నో మహారాష్ట్రంలో ఉన్నాయి. దక్షిణ భారత దేశపు 'కోలాటము'ను పోలిన నృత్యాలు కొన్ని ఉన్నాయి. కేవలం డోమ్మరవిద్యలకూ, తాలింఖానావిద్యకూ సంబంధించిన నృత్యాలు కూడా కొన్ని ఉన్నాయి. ఇలాటి నృత్యాలలో లేజిక్ నృత్యమొకటి. మహారాష్ట్ర జానపద నృత్యాలలో అన్నిటికంటే ప్రముఖమైనదిది. దీనిలోని బృంద సంవిధానం అనేకంగానూ, వివిధరీతులుగానూ ఉంటుంది. ఈ నృత్యంలో ఉపయుక్తం కాని, మహారాష్ట్ర నృత్యరీతి ఏదీ వుండదని చెప్పవచ్చు. ఇందులో, దూకటం, ఎగరటం, కూర్చోవటం, వంగటం ఉంది; ప్రతిగతీ లెజిం (చిన్నకొయ్యగూటం) ధ్వనుల లయ కేమాత్రం తప్పిపోకుండా చేస్తారు. నాలుగు లేక ఎనిమిది గణాల ప్రకారం లెజిం ఊపుతారు; ఈ విధంగా తాళయుక్తమైన అనుసరణం సంతరించబడుతుంది. లెజిం నృత్యం, శారీరక వ్యాయామ శిక్షణక్రింద పాఠశాలలలో విశేషంగా చేయుబడుతున్నది.

అన్నిటికంటే మొరటైనదీ, సర్వసామాన్యమైనదీ 'దహీకళ' లేక 'దహీబండి' అనబడే నృత్యం. దహీ (పెరుగు) దొంగిలించటమనే శ్రీకృష్ణుని చిన్ననాటి ముద్దుపెపు కొంటె చేష్టలను జ్ఞప్తిచేస్తూ, ఈ నృత్యాన్ని గోకులాష్టమి మరుసటి రోజున చేస్తారు. చిత్‌పవన్ బ్రాహ్మణులు కానీయండి, ఠాకూరులు కానీయండి, మహారాష్ట్రంలోని అన్ని కులాల వారూ ఈ నృత్యం చేస్తారు.

పెరుగు నింపిన కుండను గ్రామ దేవాలయ ద్వారం

ముందు పగులగొట్టి, ఆ పిమ్మట నర్తకులు "గోవిందా!" అని అరుస్తూ ఇంటింటికి తిరుగుతారు. వారిలో బలిష్ఠులైనవారు ఒకరి భుజాలపై ఒకరు చేతులుంచి గుండ్రంగా నిలుస్తారు. చురుకైన కుర్రవాళ్ళు కొందరు వారి భుజాలపై కెక్కి పిరమిడ్ (నిలచిఉన్న త్రికోణాకృతి)లాగా నిలుస్తారు. అప్పుడొక చిన్నపిల్లవాడు శ్రీకృష్ణునివేషంతో రెండవఅంతస్తులోనున్న వారి భుజాలపై కెక్కి కుండను అందుకోవటానికి ప్రయత్నం చేస్తాడు. ప్రతిఇంటా ఆ రోజున కుండలు వ్రేలాడకట్తారు. అది పగిలిపోగానే, దాని ముక్కలను పట్టుకోవటానికి పెనగులాడుతారు. పాడిని పెంపొందించే మహిమ ఈ ముక్కలకు ఉన్నదని వారి నమ్మకం. ఈ తంతంతా అయిపోగానే ఆ బృందం ప్రక్కయింటికి తరలిపోతుంది.

నక్టానృత్యం హాస్యరసభరితమైనది.' ఇందులో కోలి, కోలిన్, నక్టా (చప్పిడిముక్కు) అనే మూడుపాత్రలుంటాయి. నక్టా పాత్రధారి కృత్రిమముఖం పెట్టుకొని ప్రత్యేకమైన దుస్తులు ధరిస్తాడు. వీరు సంగీత లయాన్వితంగా రంగస్థలం మీద వెనుకకు ముందుకు నడుస్తూ పాడే పాటను అభియిస్తుంటారు, నక్టా ప్రతిసంచలనాన్ని అతిగా చేస్తూ నవ్వు పుట్టించేటట్లు అభినయం చేస్తాడు; అప్పుడప్పుడు "బూ—ఊ" అంటూ అరుస్తూ వాళ్ళమీద బాణం వదులుతూ పిల్లలను భయపెట్టటం అతని హక్కు. అయితే ఆ బాణం విల్లును వదలి వెళ్ళదు; బాణం విల్లుకు కట్టివేసి వుంటుంది.

దశావతార్ లేక బోహాడ అనేది మహారాష్ట్ర జానపద నృత్య నాటకం. దీనిని తాత్కాలికంగా వేసిన రంగ

స్థలంమీద ప్రదర్శిస్తారు. సూత్రధారుడు ముందుగా గణపతిని, సరస్వతిని పిలుస్తాడు; ఆ తర్వాత విష్ణువుయొక్క దశావతారాలను, ఏ వరుసలో బడితే ఆ వరుసలో పిలుస్తాడు. స్థానికంగా ఏ దేవుడు అభిమాన పాత్రుడో ఆ దేవునికి అగ్ర స్థానం ఇవ్వబడుతుంది. రామరావణయుద్ధం, హిరణ్యకశ్యప నారసింహగాధలుకూడా ఈ నృత్యాలకు ఇతివృత్తాలుగా ఉన్నాయి. ఈ గాధలు శక్తి సంభరితంగా ప్రదర్శింపబడుతూ సుదీర్ఘమైన నృత్యనాటకాలుగా రూపొందినవి.

'తమాషా' అనేది మహారాష్ట్ర జానపద సంగీత రూపకం. సైనికులకు వినోదం కల్పించటానికీ, కాలక్షేపానికీ, వారిలో యుద్ధోత్సాహాన్ని ప్రకోపింపజేయటానికీ ఈ నృత్యం పుట్టింది. బ్రిటీషు పరిపాలన ఆరంభం కావటంతో పట్టి అసభ్యతకు ఆలవాలమై భ్రష్టమైపోయింది. దీనిలో నీచత, అసహ్యతల కారణంగా దీనిపై రోతపుట్టింది. అయినప్పటికీ దీనిని పునః చైతన్యవంతము చేయటానికీ, ప్రజాభిమాన పాత్రమైన అభ్యుదయ ఇతివృత్తాల ప్రదర్శనకు అర్హంగా రూపొందించటానికీ ప్రయత్నాలు జరుగుతున్నాయి.

మహారాష్ట్రములోని సంగీతరూపకాలలో 'పావడా' మరొకరకం. దీనిలో శివదేవుని వీరగాథలు వర్ణింపబడుతాయి. తంబురావాద్యమూ, ప్రధానపాత్రధారుని గాత్ర సంగీతమూ ఈ నృత్యానికి అనుసరణగానం.

ఏ వర్గానికి చెందిన వారైనప్పటికీ, మహారాష్ట్ర బాలికలకందరికీ అభిమానపాత్రమైన నృత్యం 'ఫుంగడి.' ఇదొక రకమైన ఆట. సాధారణంగా ఇద్దరు కలసి ఆడుతారు;

స్థలమున్నట్లయితే ఇంకా ఎక్కువమంది కలుస్తారు. బాలికలు ఒకరి కొకరు అభిముఖంగా నిలువబడి చేతులు కత్తెరలాగా పెట్టి, అరచేతులు కలుపుతారు; కాళ్ళు కలిపి ఉంచి; వెనుకకు వంగి, చేతులుచాచి తాము తిరగగలిగినంత వేగంగా, తిరుగగలిగినంతసేపు గిర్రున తిరుగుతారు. అప్పుడు అలసిపోయి విడిపోతారు.

స్వల్పమైన భేదాలతో 'ఫుంగడి'రీతులు చాలా ఉన్నాయి. ఒకదానిలో, అరచేతులు కలపటానికి బదులు, బాలికలు, ఒకరి మణికట్టొకరు పట్టుకొంటారు. మరొక దానిలో ఒకరు నిలువబడి ఉంటే మరొకరు కూర్చొంటారు. మూడవదానిలో, ఒకరు ఒంటికాలిపైన నిలచి, రెండవ కాలును ఎదుట నిలచిఉన్న రెండవ బాలికతొడపై ఉంచుతారు. 'ఫుంగడి' నృత్యంలో వినోదం, వ్యాయామం, ఆహ్లాదం ఉన్నాయి. బాలికల పాఠశాలలలో ఇది వ్యాయామ శిక్షణలో భాగంగా అభ్యాసం చేయబడుతున్నది.

బొంబాయిలోని గోవన్ల నృత్యాలను ఉటంకించకుండా వదలివేస్తే సౌరాష్ట్ర, మహారాష్ట్ర, గుజరాతుల విషయం పరిపూర్తి కాదు. వారి సుప్రసిద్ధ నృత్యాలలో కొన్ని ఇవి:

### కుంబి గుమ్మోట్ నృత్యం:

గుమ్మోట్ వాద్యగాండ్రు గాన మందియ్యగా కుంబి పురుషులు భుజాలపై పాదాలు పెట్టుకొని నృత్యం చేస్తారు; అటుపిమ్మట స్త్రీలు వారితో కలసి నృత్యం చేస్తారు. అందమయిన పెండ్లి ఊరేగింపు కన్పించగానే ఉద్రేకం ఉప్పొంగి

పోతుంది; ప్రధానోత్సవం జరుపుతారు; వధూవరులచుట్టూ ఉత్సాహాతిరేకంతో "హోయ్" అని అనుస్తూ చేతిరుమాళ్ళను ఎగురవేస్తూ స్త్రీలు నృత్యం చేస్తారు.

## పంట నృత్యం:

దీనిలో పాటలు బాగా పంటలు పండటాన్ని వర్ణిస్తాయి. బాలికలు 'గాగ్రాల'ను ధరించి రంగంమీదకు వస్తారు; కొందరు పంట కోస్తుంటారు; కొందరు తూర్పార బడుతుంటారు. అందరూ సమ్మోహనకరమైన సంగీతం పాడుతుంటారు.

## దక్షి నృత్యం:

కొందరు నర్తకులు కలసి తాము ధరించిన సుందర వస్త్రాలను, ఆభరణాలను, పుష్పాలను ప్రదర్శిస్తూ 'దక్షి' అభినయం చేస్తూ ముందుకు వెనుకకు నడుస్తూ వుండటంతో ఇది ఆరంభ మవుతుంది. వీరికంటే భిన్నరీతిగా వేషాలు ధరించిన బృందాన్ని తమతో కలసి నాట్యం చేయవలసిన దిగా ఆహ్వానిస్తారు. నర్తకులకు, పడవ నడిపేవానికీ జరిగే సంవాదంతో నృత్యవేగం పెరుగుతుంది. వివాహోత్సవం చూడటంకోసం తమను అద్దరి చేర్చవలసిందిగా నర్తకు లతని నడుగుతారు. తాళము కహెర్వా, గుమ్మాట్, మాండియన్‌లు అనుసరణ వాద్యాలు.

సౌరాష్ట్ర, గుజరాత్ మహారాష్ట్ర ప్రాంతములలో ధరించే దుస్తులలో చాలా వైవిధ్యం ఉంది. రాజస్థాన్ స్త్రీలు ధరించే పావడాను బోలిన పావడా మొదలు, మహారాష్ట్ర

స్త్రీల ప్రత్యేకత అని చెప్పతగిన బిగుతు చీరెవరకు వీనిలో ఉన్నాయి. గర్బానృత్యాలు ప్రదర్శించేటప్పుడు నిబిడ వర్ణాలుగల సన్నని పావడాలు, గవ్వల. లక్కపూసల సొమ్ములు ధరిస్తారు. మహారాష్ట్రస్త్రీలు అలాగాక చీరెలు బిగుతుగా కట్టుకొని పొడవాటి చేతులుగల మొఖమల్ రవికెలు తొడుక్కుంటారు. పురుషులు సౌరాష్ట్రరాసనృత్యం ప్రదర్శించేటప్పుడు వంటికి అంటిపెట్టుకొని ఉండే ధోవతి, రొమ్ము దిగువనుంచి కూడదీసివుండే చంకజుబ్బా ధరిస్తారు. ధోవతి చంకజుబ్బాకూడా తెలుపువే; తలపాగమాత్రం ఎరుపు రంగు. మహారాష్ట్ర పల్లెకారులు ఈ దుస్తులు వేసుకోరు; కాని, దానిబదులు గూడకట్టువంటిది లేక లుంగీని పోలినరీతిగా సాదాధోవతి కట్టుకుంటారు. పల్లెకారుల స్త్రీలు, మహారాష్ట్రుల వలె చీరెకట్టు కట్టుకొని, పైన చెప్పిన పొడవాటిచేతులు గల రవికెలు ధరిస్తారు. గోవసీల వేషాలలో పాశ్చాత్య ప్రభావం స్పష్టంగా గోచరిస్తుంది. వారి వేషాలలో కొన్ని దక్షిణ యూరోపు ప్రజల జానపద వేషాలు. అక్కడక్కడ వారి వేషాలు గుజరాత్ గ్రామీణుల వేషాలను పోలి వుండటమూ కద్దు.

వింధ్య పర్వతాలకు దక్షిణాన భారత ద్వీపకల్పపు దక్షిణపు కొనవరకూఉన్న రాష్ట్రాలు దేశంలోని ఏప్రాంతం లోనూ కన్పించని ఒకానొక భారతీయ సంస్కృతి రీతిని భద్రపరచి ఉంచినవి. ఆర్యుల రాకకు ముందుకాలంనాటి ద్రావిడ సంస్కృతినుండి వచ్చిన ప్రాచీన నాగరికతగలది ఈ ప్రాంతం. ఇచటి ప్రజలు విశేషసంప్రదాయ నిష్ఠగలవారు;

దండయాత్రల తాకిడికి గురిగాకుండా పూర్వాచారాలను ఈనాటివరకు సంరక్షించుకొన్నారు.

దక్కను ప్రాంతమంతాకూడా అనేకరీతుల నృత్యాలకు నిలయంగా ఉంది. తమిళనాడులోనూ, కేరళలోనూ, భారతీయ నృత్యంయొక్క శాస్త్రీయరీతి అత్యంత ప్రామాణిక రూపంతో పదిలపరచబడి ఉన్నదనుటలో సందేహం లేదు. ఈ ప్రాంతాలకు సంబంధించిన పురాణాలు, గాథలనుబట్టి చూస్తే పురాతన కాలంనుంచికూడా ఇచటి ప్రజల జీవితానికీ నృత్యానికీ అవినాభావసంబంధం ఉన్నట్లు ధ్రువపడుతుంది. రామాయణకాలం లగాయతు, మహాభారత కాలందాకా అర్జునునివంటి వీరులు, నృత్య విద్య నభ్యసించటానికి అటు అస్సాం, మణిపూరులకు ఇటు మలబారుకు వెళ్ళినట్లు మనకు తెలుస్తుంది.

ప్రాచీనకాలంనుంచికూడా ఈ ప్రాంతంలో అనేక రీతుల నృత్యాలు ప్రచారంలో ఉన్నట్లు మనకుచెప్పేగాథలు సంస్కృతంలోనూ దక్షిణ భారతీయ భాషలలోనూ లెక్క లేనన్ని ఉన్నాయి. ఆ చర్చ మనకిక్కడ అనవసరం. భరతనాట్యం, కథాకళి, కూచిపూడి మొదలైన శాస్త్రీయ రీతులను ఉటంకించటంకూడా మన కిక్కడ అనవసరమే. భారతదేశపు నాలుగు దిక్కుల మధ్యనున్న ప్రజలకొకప్పుడు తెలిసిఉండిన నాట్యశాస్త్ర సంప్రదాయాలను ఈ రీతులు తమలో పదిలపరచుకొన్నాయి. ఆంధ్రప్రదేశము, తమిళ నాడు, కేరళ, కర్ణాటక ప్రాంతాలలోని శాస్త్రీయనృత్యాలు

ఎంత సుసంపన్నంగా, ఎన్నెన్నితీరులుగా ఉన్నాయో, జాన పద నృత్యాలుకూడా అంత సుసంపన్నంగానూ, అన్నితీరులు గానూ ఉన్నాయి. ఈప్రాంతంలోని శాస్త్రీయ నృత్యాలూ, జానపద నృత్యాలూ ఒక్కొక్కచోట దగ్గరకు వస్తాయి; అక్కడ ఆ రెండిటికీ మధ్య ఆట్టే తేడా కనిపించదు; మూల విధానంలో తేడా కనిపించదు; శాస్త్రబద్ధ రీతిలో ఎక్కువ తక్కువలు మాత్రం రెంటిమధ్యగల వ్యత్యాసాలు. ఉదా హరణకు చెప్పాలంటే, భరతనాట్యాన్ని పోషిస్తున్న దేవ దాసి సంప్రదాయం, ఈ ప్రాంతంలో చాలా జానపద నృత్యాలకు కూడా ఆలవాలంగా ఉంది.

స్థూలంగా చెప్పాలంటే భారత దేశంలోని ఇతరరాష్ట్రాల జానపద నృత్యాలను విభజించ గలిగినట్లుగానే, ఈ ప్రాంతపు జానపదనృత్యాలనుకూడా, ఇటు గిరిజనుల ఆదిమవాసుల నృత్యాల క్రిందను, అటు గ్రామీణ ప్రజల సాంఘిక నృత్యాల క్రిందను విభజించవచ్చును. ఈ నాలుగు దక్షిణ భారత రాష్ట్రాలకూ, అంటే, ఆంధ్రప్రదేశం, తమిళనాడు, కర్ణాటక, కేరళలలో ఈ రెండువర్గాలకు చెందిన నృత్యా లున్నా ఒకేరీతిగా వుంటాయి.

## ఆంధ్రప్రదేశ్ :

ఆంధ్రప్రదేశంలో గిరిజనుల నృత్యాలు, ప్రత్యేకంగా బంజారాల, సిద్దీల నృత్యాలు కొల్లలుగా ఉన్నాయి. బంజా రాలు, హైదరాబాదులోని ముఖ్యమైన దేశద్రిమ్మరుల తెగ. ఈ తెగలోని పురుషులు కూలి నాలి చేస్తుంటారు. భార తీయ జానపద నర్తకులలోకెల్ల శోభాయమానమయిన

దుస్తులు ధరించే వారి ఇల్లాండ్రను పశువులను మేపుతూ, చిల్లరదినుసులు, చిత్రవిచిత్ర వస్తువులూ అమ్ముతూ తిరుగు తుంటారు. బంజారా నృత్యాలు సరళంగా ఉంటాయి; అయితే అందులో చక్కని సామరస్యం ఉంది. తమ జీవితా లకు సంబంధించిన నిత్యకృత్యాలయిన చేలు కోయటం, మొక్కలు నాటటం, విత్తనాలు చల్లటంవంటి పనులకు సంబంధించిన దేహసంచలనాలవల్ల ఈ నృత్యాలు ప్రేరిత మౌతున్నవి. స్త్రీలు చేసే నృత్యాలలో సర్వసామాన్యంగా, తలలమీద తళతళ మెరిసే ఇత్తడి బిందెలు పెట్టుకొని, నీటి కోసం ఊరబావికి వెళ్ళటం ప్రదర్శించబడుతుంది. కటిని నెమ్మదిగా మహాసుందరంగా ప్రక్కలకు త్రిప్పటం ఈ నృత్యంలోని విలక్షణాభినయం; 25 గురు లేక 35 గురు అంగనలు బారుతీరి ఇలా చేస్తున్నప్పుడు చక్కని లయాన్విత మైన వంపు ఏర్పడుతుంది. స్త్రీలు తామే స్వయంగా పాడే పాటకు, వారి ఆభరణాలధ్వనులు పదనురంజక తాళవాద్యా లుగా ఉపచరిస్తాయి. దసరాపండుగ కాలంలోకూడా ఈ వని తలు చాలా నృత్యాలు చేస్తారు. వీరి దుస్తులు; ముందు చెప్పినరీతిగా చాలా అందంగానూ, ఆహ్లాదకరంగానూ ఉంటాయి. వాళ్ళు వేసుకొనే దుస్తులలో ముఖ్యమైనది ప్రావడా; దీనికి నడుముక్రింద, ఎరుపు, పసుపువర్ణాల చారవుం టుంది. పావడామీద చాలా అందంగా గాజు, అద్దపు ముక్కలు కుట్టి ఉంటాయి. తలపై ముసుగువేసుకొనే దుప్ప టాలమీదకూడా అంచులలో అందంగా గాజుపూసలు కుట్టి వుంటాయి. వారి చేతులు, మెడలు, చెవులుకూడా వెండి

ఆభరణాలతో, పూసలనగలతో నిండి ఉంటాయి. మొత్తం మీద వాళ్ళను చూస్తుంటే అలంకృతమైన దృశ్యాన్ని చూచినట్లుంటుంది.

బంజారాలేకాక, గోండులతెగ కూడా వుంది. ఇది, ఆంధ్రప్రదేశ్ గిరిజన జాతులలోకెల్ల పెద్దదేకాకుండా బలిష్ఠమైనది కూడాను దసరా అనంతరము ఇంచుమించు రెండు వారాలపాటు, గోండుగ్రామాలవారు పనిపాటులన్నీ కట్టిపెట్టి ఉత్సవోత్సాహంతో పరవశులై ఉంటారు. దాపుడుబట్టలు వేసుకొని, నర్తకులు జట్టులుగా ఆ గ్రామంవారు ఈ గ్రామానికీ, ఈ గ్రామంవారా గ్రామానికీ వెళ్తారు. వీరు వెళ్ళిన చోటల్లా గౌరవనీయులైన అతిథులులాగా మర్యాదలు చేస్తారు. మున్ముందుగా, యువజనం, గాయకులు వెంటరాగా చకచకా వస్తారు; ముసలివాళ్లు చివరకు వస్తారు. పిమ్మట వాళ్ళంతరూ కలిసి, ఎడమనుండి కుడివైపునకు తిరుగుతూ, చేతులలోని కర్రలను ఒకదానిపై ఒకటి కొట్టి తాళంవేస్తూ నృత్యం చేస్తారు. వీళ్ళనే దండారియా నర్తకులంటారు. అనుశ్రుతంగా వచ్చే గాథనుబట్టి, పంచపాండవ జాతిలో ప్రసిద్ధికెక్కిన పూర్వీకుడగు దండారియా అనేవీరుడు ఈ ఆచారాన్ని సృష్టించినట్లు చెపుతారు. ఇలాటి ఆచారలవల్ల గ్రామాలమధ్య ఉత్సవ వాతావరణంలో సాంఘికానుబంధాలేర్పడుతాయి కనుక, ఈ తెగయొక్క ఐకమత్యమును పోషించటానికి ఇవి ఒక విశిష్టవిధానంగా ఉపచరిస్తున్నవి.

దండారియా నృత్యంలో మగవారు మాత్రమే పాల్గొంటారు. బాలకులు ఆడపిల్లల వేషాలు వేస్తారు. యువతుల

పాత్రలు ధరించే బాలకులు కాగడాలతో నృత్యానికి పురో భాగాన ఉంటారు; గాయకులు డోలు వాయిద్యగాళ్ళు, తప్పెటలు వాయించేవారు నర్తకుల ననుసరిస్తారు. నర్తకులు వారి స్వాభావికమైన దుస్తులనే వేసుకొని, గలగల మ్రోగే అందెలతో, తళతళ మెరిసే నగలతో నడుస్తారు. వారిలో కొందరు 'గునెలా' మద్దెలలు, మట్టితో చేసిన 'తుర్పులీ'లు పట్టుకొంటారు. కర్రలు చేత పుచ్చుకొంటారు, వలయాకారంగా ఏర్పడుతారు. నిదానంగా అడుగులు వేస్తూ, ఎడమనుంచి కుడివైపునకు కదులుతారు; నృత్యం చేస్తున్నంత సేపూ వలయంలోపలికే తిరిగివుండి ప్రక్రియ జరుగుతున్నప్పుడు, కాళ్ళు ఒకదాని అవతల ఒకటి కత్తెరలాగా పెట్టారు.

ఆ తర్వాత దైవ ప్రార్థన ఆరంభ మవుతుంది. అప్పుడు, ఒక బృందం తర్వాత మరొక బృందం చొప్పున వివిధ బృందాలు భక్తి ద్విపదలను పాడుతూ ఉండగా, నర్తకులు తూర్పు, పడమర, దక్షిణం, ఉత్తరం నాల్గు దిక్కులకూ కదులుతూ ఉండి, క్రిందికి వంగుతారు.

తెలంగాణా ప్రాంతంలో, ఒక ప్రాచీన గాథపై ఆధారపడిన 'బతకమ్మ' అనే స్త్రీల నృత్యం ఉంది. ఇది 'సైజన్ బాయి' కథను తెలుపుతుంది. ఈమె ఒక రాజపుత్ర రాజుకు ఏకపుత్రి; అతి గారాబంగా పెరిగినందువల్ల గృహ కృత్యాలేవీ నేర్చుకోలేదు. ఆమె పెండ్లి నిశ్చయం చేస్తున్న సందర్భంలో గృహకృత్యాలు చేతకానందుకు కాబోయే అల్లుళ్ళు నిరసన తెలిపారు. అందుచేత ఆమె తన విధులు నిర్వర్తించటం నేర్చుకొనక తప్పిందికాదు. వాటిలో

మొదటిది పేడతో పిడకలు చేయటం. ఆమె పెండ్లాడిన తర్వాత అత్తను సంతృప్తిపరచలేకపోయింది. అత్త తప్పులు పట్టటం, సాధించటం పడలేక ఆమె తండ్రి ఇంటికి మరలి వచ్చింది; జీవితాంతంవరకు అక్కడే గడిపింది. క్రొత్తగా పెండ్లిచేసుకొన్న స్త్రీలు, 'బతకమ్మ' నృత్యాన్ని ఎంతో ఆవేశంతో ప్రదర్శిస్తారు.

హైదరాబాదులోని సిద్దీలు చేసే సిద్దీ నృత్యం, జానపద నృత్యాలలోకెల్ల భారతీయేతరమైనదని చెప్పవచ్చును. పుట్టుకతో ఆఫ్రికనులైన సిద్దీలు, 14వ శతాబ్దం మధ్య భాగంలో, అరబ్బులు, టర్కులు, ఇరానీలు వంటి ఇతర ముస్లిములతో పాటు హైదరాబాదుకు వలస వచ్చారు. హైదరాబాదు నవాబు సేనలలో సిద్దీలు నియమితులై నిజాము ప్రత్యేకఅంగరక్షకదళంగా ఏర్పాటయినారు. నిజాము సైన్యాలలోని అద్వితీయ ఆశ్విక దళాలుగా వారు ప్రశస్తిపొందారు. సిద్దీల నృత్యాలలో వాటి పూర్వపు ఆఫ్రికారీతులు ఇంకా నిలిచి ఉన్నాయి. అలాటి యుద్ధ నృత్యాలలో ఖడ్గనృత్యం ఒకటి – ఇది సాధారణంగా వివాహ సందర్భాలలో చేస్తారు. నర్తకులు రంగు రంగుల లుంగీలు ధరించి, నడుమ పటకాలో బాకు బిగించి చేతిలో ఖడ్గము ధరించి నృత్యం చేస్తారు.

నర్తకులు, అర్ధవలయాకృతిగా ఏర్పడి, వెనుక గానం ఆలపించబడుతూ ఉండగా రకరకాల ఖడ్గ యుద్ధరీతులు ప్రదర్శిస్తారు. వేగం తీవ్రమయ్యేకొద్దీ నృత్యం పరాకాష్ట నందుకోగా నర్తకులు బాకులను నోట కరచుకొని పై కెగురుతారు;

నవదంపతులను ఆశీర్వదించే నినాదాలు చేస్తూ నృత్యంతో రంగం అవతలికి వెళ్తారు.

ఆంధ్రప్రదేశంలోని డప్పువాద్యం సిద్ధి నృత్యానికి కేవలం భిన్నంగా ఉంటుంది. దీనికీతి ఎక్కువ ప్రసన్నంగా ఉంటుంది; నిజానికిది నృత్యమనటంకంటే వాద్యగోష్ఠి అన తగింది.

డప్పువాద్యం ఆంధ్రలోని జానపద వాద్యం; గ్రామ సీమలలో అది ప్రధాన వినోద వాద్యం. ఈ వాద్యం గంటలులేని పెద్ద కంజిరా. దీనిని పుల్లతో వాయిస్తారు. సాధారణంగా దీనిని హరిజనులు వాయిస్తారు; ఈ ప్రదర్శనంలో ఒకరుగానీ, పలువురుగానీ పాల్గొంటారు. ఈ వాద్యాన్ని వాయించేటప్పుడు వాయించేవాళ్ళు, వాద్యపు తాళాని కనుగుణంగా తమ శరీరాలను కదలిస్తారు. అప్పుడప్పుడు, ఈ వాద్యాన్ని వాయించేటప్పుడు ఒక ప్రక్క నుంచి మరొక ప్రక్కకు దూకుతూ, ఒకరి అవతలకు ఒకరు దాటుతూ చాలా సంకీర్ణ గమనరీతులను చూపుతారు.

## కర్ణాటక:

కర్ణాటక ప్రాంతం నాటకరీతులు కలిగిన జానపద నృత్యాలు చాలా పదిలపరచి వుంచింది. ఈనాడు మనకు గోచరమవుతున్న రీతులలో ఒకటి రెండు జానపద నృత్యాలను కూడా కర్ణాటకము భద్రపరచింది. ఏది యేమైనప్పటికీ కర్ణాటక జానపద నృత్యాలను గురించి చెప్పేటప్పుడు యక్షగానము, పురవిఅట్టం ముందు తోస్తాయి. జానపదుల వినోదం కొరకు సృష్టింపబడిన సరళ నాటకాల పరిపూర్ణ రూపమే



56. పై చిత్రం : గర్బానృత్యం; గుజరాత్

57. క్రింది చిత్రం : పంటకోతల నృత్యం; గోవా



58. పై చిత్రం : పవడాగానం; మహారాష్ట్ర

59. క్రింది చిత్రం : కోలీజాలరుల నృత్యం; బొంబాయి





60. పై చిత్రం : కోలీజాలరుల నృత్యం; బొంబాయి

61. క్రింది చిత్రం : లంబాడీస్త్రీల నృత్యం: హైదరాబాదు





62. చిత్రం : సిద్దీల ఖడ్గనృత్యం; హైదరాబాదు

యక్షగానం. మలబారులోని కథాకళితో ఈ యక్ష గానానికి సన్నిహిత సంబంధం ఉన్నదని చెప్పటం అతిశయోక్తి కాదు. యక్షగానాన్ని బయలాట అని కూడా అనటం కద్దు; కారణం– ఇది తరచు బహిరంగ ప్రదేశంలో ప్రదర్శించబడుతూ ఉండటమే. ప్రత్యేకంగా రామాయణ, మహాభారత గాథలే యక్షగానానికి ఇతివృత్తాలుగా ఉన్నాయి. నర్తకులు ఎవరిపాటలు వారే పాడుతారు; రంగానికీ రంగానికీ మధ్య విరామ కాలంలోగానీ లేక సంభాషణ అనంతరంగానీ, ప్రధాన రంగంలో ఒక్కొక్క భాగం ముగిసిన తర్వాత గాని నృత్యం చేస్తారు. ఐతే, యక్షగానంలోని కథలలో ఎక్కువభాగం యుద్ధానికి చెందినవే; శృంగార రసకథను ప్రదర్శించట మనేది అరుదుగా కన్పిస్తుంది. యక్షగాన నర్తకులు వేసుకొనే వేషాలు కథాకళీ నర్తకులు వేసుకొనే వేషాలను పోలి ఉంటాయి. అయితే, ముఖాలంకరణంమాత్రం కొంత వరకు నిరాడంబరంగా వుంటుంది. వీరులకు రాక్షసులకు సంబంధించిన వివిధరకాల పాత్రలకు బదులు ఇందులో మంచి పాత్రలూ, చెడ్డ పాత్రలూ మాత్రమే వుంటాయి. పాత్రలయొక్క ఈ రెండు సాధారణ వర్గాలను సౌమ్య, రౌద్ర పాత్రలని పిలుస్తారు. ప్రదర్శనాంతంలో మంచి, చెడును జయించటమనేది తప్పకుండా ఉంటుంది. యక్షగానాన్ని బెంగాలు జాత్రాలతో పోల్చవచ్చును.

పురవిఅట్టం చాలా పురాతనపు దక్షిణ భారత జానపద నృత్యం. కర్ణాటకంలోనేగాక, భారతదేశంలోని ఇతర ప్రాంతాలలోకూడా ఇది కన్పిస్తుంది. బొమ్మ గుర్రం ఆట

అని ప్రసిద్ధి పొందిన ఇది పాండ్య, చేర, చోళకాలంనుంచీ ప్రచారంలో ఉన్నట్లు విశ్వసించబడుతున్నది. మతసంబంధ మయిన సాంఘిక సంబంధమయిన సందర్భాలలో ఎక్కువగా ప్రదర్శింపబడుతున్న ఈ నృత్యం చరిత్రనుంచి, పురాణాల నుంచి చిన్నచిన్న కథలను తీసుకొని సులభంగా గ్రాహ్యమయ్యే సంకేతములద్వారా ప్రదర్శిస్తుంది.

శోభాయమానమైన ఈ నృత్యంలో, ఊతకాళ్ళ (కొయ్యకాళ్ళ మీద) నిలచిన నర్తకునిచుట్టూ వెదురు చట్రంతో గుర్రం బొమ్మను నిర్మిస్తారు.

ఈ నృత్యాన్ని సామాన్యంగా గాత్రసంగీతం, వాద్య సంగీతం అనుసరించి ఉంటుంది. గుర్రపురౌతు వీరుణ్ణి అతని ప్రేయసీమణి, పరివారమూ అనుసరించి ఉండి, ఈనృత్యానికి ఇతోధిక శోభను చేకూరుస్తారు.

**బాలకత్ నృత్యం:**

బాలకత్ నృత్యం, మైసూరు రాష్ట్రంలోని బోడవల జానపదనృత్యం పంటకోత పండుగలవంటి ఆనందసమయాల్లో ఈ నృత్యం తప్పనిసరిగా ఒక భాగంగా వుంటుంది.

'కుప్పా' అనబడే పొడవాటి నల్లని కోటును మహా హుందాగా ధరించి, వింతరీతిగా ఉండే తెల్లని తలపాగ ధరించి బాకు చేత పుచ్చుకొని; జానపదగీతాలు, వాద్య సంగీతం ఆలపించబడుతూ ఉండగా పురుషులు ఈనృత్యాన్ని చేస్తారు.

మనోహరమూ, వర్ణసంశోభితమూనైన వేషాలకూ, నర్తకుల లయాన్విత గతులకూ బాలకత్ నృత్యం ప్రసిద్ధి పొందింది.

కర్ణాటకములోని సాంఘిక నృత్యాలలో కుమ్మి, కోలాటంవంటివి ఉన్నాయి; ఇవి తమిళనాడు, కర్ణాటక మలబారులలో ఒకేవిధంగా ఉన్నాయి.

## తమిళనాడు:

నేడు భరత నాట్యానికి ఆలవాలంగా ఉన్న తమిళనాడు శాస్త్రీయ రీతులలోనే కాక, దేశినృత్య, నాటక రీతులనబడే వానిలో కూడా సుసంపన్నంగాఉంది. తమిళనాడులో ఛాలా జానపద నృత్యాలు ప్రచారంలో ఉండేవి. ఇవి, ఒకవైపు శాస్త్రీయ నృత్యాలకూ, మరొకవైపు 'ఆదిమ' నృత్యాలకూ, సంబంధించి ఉండేవి. ఈ నృత్యాలలో చాలా మట్టుకు అదృశ్యమై పోయినవి. కాని, నేటికికూడా, వీనిలోకొన్ని పదిల పరచబడి ఉండటం, తమిళనాడు ప్రజల సజీవ సంప్రదాయంలో అవి అంతర్భాగంగా ఉండటం మనకు గోచరిస్తుంది. తమిళనాడు కురవంజి, స్వయం సంపూర్ణమైన, బహుళ రీతి సంపన్నమైన నృత్యం. కురవంజి నృత్యం, కురటులనబడే దేశద్రిమ్మరుల జాతిలో వంశపారంపర్యా వస్తున్న నృత్యం. సిలప్పదికారంవంటి గ్రంథాలలో కురటుల ప్రసక్తి కన్పిస్తుంది. ఈ నృత్యాలలో, ఎప్పుడు చూచినా, ఒక కురటి, కొండ ప్రాంతాల నుంచి దిగి రావటం, పట్టణాలలోని రాజుల రాణుల జాతకాలను చెప్పటం ఉంటుంది. సర్వసాధారణంగా చిన్నారి

పడుచులు ఈ నృత్యం చేస్తారు. తమను చూచి దేవతలు మోహించి, ఈ లోకంనుంచి స్వర్గానికి తీసుకుపోకుండా వుండటం కోసమని వీరు తమ ముఖాలపై నగిషీ పచ్చబొట్లు పొడిపించు కుంటారు. ఈ యువతులు గ్రామ సీమలలో తిరుగుతూ, డబ్బిచ్చే వాళ్ళకెవరి కైనాసరే నృత్యం నేర్పు తుంటారు. కురవంజి నృత్యరీతి భరతనాట్యరీతిగా ఉంటుంది. అయినప్పటికినీ భరతనాట్య రీతులను పోలిన రీతు లిందులో చాలా ఉన్నాయి. భరతనాట్యం గతులలో కన్పించే విస్పష్టత, తూకమూ కురవంజి నృత్యాలలో కూడా కన్పిస్తాయి; నిజానికి, కురవంజి నృత్యాలు భరతనాట్యం చేసే వారిని ఎంతగా సమ్మోహింప జేశాయంటే; భరతనాట్య ప్రదర్శనలలో కురవంజి ఇతివృత్తాన్ని కూడ తరచు ప్రదర్శించే టంతగా సమ్మోహ పరచాయి.

**బిందునృత్యం:**

పుదుచ్చేరిలో వుండే కొరవ, కల్లవ, కురివికరణ్ వంటి దేశద్రిమ్మరుల జాతులలో బిందు నృత్యం ఎక్కువ ప్రచారంలో ఉంది. చిన్నచిన్న మృగాలను, పక్షులను వల పన్ని పట్టుకోవటం వీరి ప్రధాన వృత్తి; వీరి జానపద గానంలో ఈ వృత్తి ప్రతిబింబిత మవుతుంది.

ఆరుగురు వ్యక్తులు తమ జాతి ప్రత్యేక దుస్తులు ధరించి ఈ నృత్యం చేస్తారు, నృత్యం వెనుక పాడే పాట ఎక్కువ ప్రచారంలో ఉన్న ఒక జానపద గీతం. వలపన్ని పట్టుకొనేటప్పటి సంఘటనలను వర్ణిస్తుంది. మధ్యమధ్య, పాట చెప్పే అతను ఒక చరణం పాడగానే వంతవాద్యగాళ్ళందరు

కూడా కలసి పాడుతారు. నర్తకులు నృత్యరీతులను మారుస్తూ ఉండగా, పాటరీతి అదే విధంగా కొనసాగుతుంది.

కరగం :

నృత్యరూపాలు తమిళనాడులోనూ, మలబారులోనూ వున్నాయి. మలబారులో వీనిని కుడ్డట్టు నృత్యా లంటారు. కృష్ణుడు బాణాసురుణ్ణి జయించిన దానికి జ్ఞాపక చిహ్నంగా ఈ నృత్యాలు చేయబడు తున్నట్లు భావించబడుతున్నది. నేడు ఘటనృత్యాలలో కొన్ని కేవలం సాము గరిడీలలాగ కనిపిస్తున్నవి. ఇందులో కొందరు నర్తకులు నాలుగైదు చిన్న కుండలతో ఒకేసారి చమత్కారాలు చేయటం కూడా తరచు కనిపిస్తుంది. మలబారు రాష్ట్రంలోని శిల్పములను బట్టి చూస్తే ఈ నృత్యాలు ప్రాచీన కాలపు నృత్యాలని ఋజువవుతున్నది.

కరగం నృత్యం మద్రాసు రాష్ట్రంలోని పల్లెప్రజలలో ప్రచారంలో ఉంది. ఇత్తడిబిందెను పూలతో చక్కగా అలంకరించి, నర్తకులు తలమీద పడకుండా నిలుపుకొంటారు.

బూరలు, డోళ్ళు వాయిస్తూవుండగా, నర్తకులు, మెడలను నిఠారుగావుంచి, తలలపై బిందెలు పడకుండా నిలుపుకొంటూ, నిదానంగానూ, వేగంగానూకూడా అనేక రీతుల గతులతో నృత్యంచేస్తారు. చేతులతో పట్టుకోకుండానే తలలపైనున్న బిందెలను గిరున తిరిగేటట్లు చేయడంతో నృత్యం పరాకాష్ట నందుకొంటుంది.

తమిళనాడులోని ఇతర నృత్యాలు ఎక్కువగా నాగరిక స్వభావం కలవి. కోలాటం, కుమ్మినృత్యాలు స్త్రీలు చేసే జానపద నృత్యాలు. వీటిని కేరళలోనూ తమిళనాడు లోనూ చేస్తారు. కేరళలోనూ తమిళనాడులోనూ కూడా అనేక రకాల కోలాట నృత్యాలు ప్రచారంలో ఉన్నాయి. వీటి అన్నిటిలోనూ కోలాటం కర్రలుపయోగిస్తారు; వలయా కారంలో చేసే నృత్యం వీనిలో ప్రధాన నృత్యమైనది. కోలాటాన్ని అనుసరించి పాడేపాట, ఆ నృత్యం చేయబడే పండగకాలాన్ని అనుసరించి ఉంటుంది. కోలాటపు లయలు కూడా వేర్వేరుగా ఉంటాయి. దక్షిణభారతదేశపు కోలా టానికిన్నీ, గుజరాత్ గర్బాకూ, సౌరాష్ట్ర దాండియా రాస్ కున్నూ చిత్రమైన పోలిక లున్నాయి. కోలాట నృత్యాలలో స్త్రీల నృత్యగతులకున్నూ భరతనాట్యగతులకున్నూ మళ్ళీ పోలికలున్నాయి. శరీరమంతా ఏకఖండంగా ఉపయోగింప బడుతున్నట్లు కన్పిస్తుంది; నడుము ప్రత్యేకంగా ఉపయుక్తం కావటమంటూ లేదు; గుజరాత్ యొక్క గర్బానృత్యంలోని ప్రత్యేక లక్షణముకూడా ఇదే. పిన్నల్ కోలాటంలో, నర్త కులు, ఒకచేతితో కోలాటం త్రాడుపట్టుకొని, రెండవ చేతితో కోలాటపుకర్రలు రెండూ పట్టుకొంటారు. రకరకాల రంగుదారాలను ఇంటికప్పుకు కట్టారు. నర్తకులు లయాన్వి తంగా జరుగుతూ ఉండగా ఆదారాలు, చెరిసగం పొడవు నుంచి జడగా అల్లుకొంటాయి. పిమ్మట ఈ అల్లకాన్ని అడు గులు వేస్తూనే ఊడతీస్తారు. మరల క్రొత్తనమూనాలు అల్లు తారు. పాటలుపాడుతూ పిన్నల్ కోలాటంవేస్తారు. ఈ పాట

లకు ఒక పల్లవి, ఒక అనుపల్లవి, అనుచరణం ఉంటాయి. దక్షిణభారతదేశంలో వేర్వేరు రకాల పిన్నల్ కోలాటాలు ప్రచారంలో ఉన్నాయి. నిలువుగా బారులు తీరటం, వలయాకృతులుగా ఏర్పడటం ఈ కోలాటాలలో సర్వ సామాన్యం.

తమిళనాడులోనూ కేరళలోనూ కూడా ప్రచారంలో ఉన్న మరొక జానపదనృత్యం కుమ్మినృత్యం. కోలాటంలో ఉన్నట్లే, కుమ్మినృత్యాలలో కూడా వేర్వేరు రీతులున్నాయి. ఒక్కొక్క రకం నృత్యానికి ఒక్కొక్క రకం పాటపాడు తారు. పుష్పకుమ్మీనృత్యంలో మల్లెపువ్వు, కమలం వర్ణించ బడుతాయి. కుమ్మీలో ఇంటిపనులు వర్ణించబడుతాయి. ఈ పాట, ఒక అమ్మాయి నీళ్ళుతోడుతున్నట్లు, పాత్రలు తోముతున్నట్లు, అన్నం వండుతున్నట్లు, పిండి విసురు తున్నట్లు వర్ణిస్తుంది. జాతీయగీతాలు పాడుతూ చేసినా, సరస్వతి ప్రార్థనగీతాలు పాడుతూ చేసినా కుమ్మీలో వలయా కృతిగా ఏర్పడటం పరిపాటిగా కనిపిస్తుంది. సౌరాష్ట్రి రాస నృత్యాలలోవలెనే ఈ కుమ్మీనృత్యాలలోకూడ వలయంలో వలయాలుగా ఏర్పడటం కద్దు. ఈ నృత్యాలన్నిటిలోనూ, ఒక స్త్రీ పాట ఎత్తుకొని పాడుతూవుంటే తక్కినవారు దానిని అందుకొని పాడుతారు. ఆ తరువాత, ఒక్కొక్కరు ఒక్కొక్క చరణం ఒకరి తర్వాత ఒకరు పాడుతారు. నృత్యం చేసే వాళ్ళందరూ అలసిపోయినప్పుడే నృత్యం ఆగుతుంది; లేక పోతే అంతం లేకుండా జరుగుతూనే ఉంటుంది.

## కేరళ:

తమిళనాడువలెనే కేరళకూడ సహజశక్తిమంతమైన భారతీయశాస్త్రీయ నృత్యరీతులకు ప్రసిద్ధిపొందినది; అట్టివానిలో కథాకళి ఒకటి. మలబారువంటి ప్రాంతపు ప్రజలకు కథాకళి, ప్రజారంజకమైన వినోదమేకాక, అత్యంత శాస్త్రీయమూ, ఆధునికమూనైన హాస్యనాటకము కూడ. అయినప్పటికినీ, మలబారులో నున్నది ఈ ఒక్కరకం నృత్యమే కాదు; నిజానికి, మలబారులోనూ, కేరళలోనూ, పలయూర్ కలివంటి మిక్కిలి యుద్ధరీతి నృత్యములు మొదలు మోహినియాట్టంవంటి సుందర శృంగార నృత్యాలవరకు అనేక రకాల జానపదనృత్యాలు కన్పిస్తాయి. ఒట్టుంటుల్లల్ అనేది ఒక రకం నృత్యనాటకం. దీని అసలు పేరు పూమన్ కథాకళి. ఖచ్చితంగా చెప్పాలంటే దీనిని జానపదనృత్య మనటానికి కూడా వీలులేదు. ఎందుచేతనంటే - దీనిలోని నిండు అభినయంవల్ల, ఇది జానపదనృత్యాలకంటే, కథాకళికీ శాస్త్రీయ నృత్యాలకూ ఎక్కువ సన్నిహితంగా ఉంటుంది. ఐనా, బెంగాలునందలి యక్షగానం, జాత్రలవలె, ఒట్టంటుల్లల్ - మలబారులోని కొన్ని ప్రాంతాలలో దీనిని ఒత్తుంతుల్లల్ అని పిలుస్తారు - మలబారు గ్రామాలలో ఇంచుమించు సంవత్సరం పొడవున ఈ నృత్యం చేస్తారు. ఒత్తుం తుల్లల్ అనేమాటకు అర్థం పరుగెత్తటం, దూకటం. కథాకళి దుస్తులను పోలిన దుస్తులను వేసుకొని, ఈ నృత్యాన్ని నర్తకులు ఒంటరిగా చేస్తారు,

ఒకే నర్తకుడు స్వయంగా పాడుతూ, నాటకమంతా

తానే అభినయిస్తాడు. అతనికి తోడుగా ఒక మద్దెల, గంట మ్రోగుతుంటాయి. 150 ఏండ్లక్రితం కుంచన్ నంబియారనే ఆయన రాజదర్బారులో జరిగే ఒక నృత్యంలో తనను పాల్గొనీయనందుకు కోపంవచ్చి ఈ నృత్యాన్ని సృష్టించాడు. ప్రతీకారం తీర్చుకోవటంకోసం అతడు వీధులలో సామాన్య ప్రజలముందు ప్రదర్శన లివ్వసాగాడు. మర్మభేదకమూ అప్రయత్న లబ్ధమూనైన అతని హాస్యమువల్లనూ బ్రాహ్మణ గురువులను, జమీందారులను సమర్థంగా విమర్శించడమువల్లనూ ప్రజల హృదయాలలో అతనికి స్థావరం చిక్కింది; అతని కళ క్రమ క్రమంగా ఎక్కువ ప్రచారంలోనికి వచ్చింది. కథాకళి ప్రదర్శనకంటే బట్టంటుల్లల్ ప్రదర్శనకు ఖర్చు తక్కువవుతుంది. కనుక, దానికంటే దీనినే ప్రజ లెక్కువగా చూస్తున్నారు. అయితే, అభినయమూ, పాట, నృత్యం ఒక్కరే చేయటం కష్టసాధ్యమైన రీతి కనుక నృత్యరూపాన్ని ప్రదర్శించేవారు ఆట్టేమంది లేరు.

ఒత్తుంతుల్లల్, కొన్ని విధాల చూస్తే అర్థ అధునాతనంగా కన్పిస్తుంది. ఇది కథాకళి ఆరంభకాలం అంటే చక్యారులని పిలువబడే కథకుల కాలంనాటి రూపంగా తోస్తుంది. ఆ కాలంలో మత (పురాణ) సంబంధమైన గాథలు పాడే గాయకులు, భక్తి మత గాథల గానంతోపాటు స్థానిక విషయాల కెక్కువ ప్రాధాన్యంగల గాథలు పాడ నారంభించటంతో ఇది ఆరంభమై యుండవచ్చును. స్థానిక శ్రోతల ఆసక్తిని పెంచటానికీ పనిజరిగివుంటుంది. పాశ్చాత్య దేశాలలో నాటకమూ చర్చినుండి, చర్చి ఆవరణలోనికి

ఎలా జరిగి వచ్చిందో, అలాగే పురాణగాథల గానం దేవాలయంనుండి, దేవాలయం వెలుపలకు జరిగి వచ్చింది; దేవాలయం వెలుపలనైతే కథానాయకుడు ఎలాటి ఆపద, శంక లేకుండా ప్రభుత్వమును, సాంఘికవ్యవస్థను స్థానిక పరిస్థితులను స్వేచ్ఛగా విమర్శించ కలిగేవాడు. కథాకళి విషయంలో జరిగినదానికీ దీనికీ చాలా తేడా ఉన్నది. కథాకళి పురాణగాథల కథనమునకు, అభినయమునకు పరిమితమైనది.

కేరళలోని మోహినియాట్టం నృత్యంబత్తు తుల్ల నృత్యానికి కేవలం వ్యతిరేకంగా ఉంటుంది. ఈ నృత్యం పూర్తిగా జానపద నృత్య వర్గానికి చెందిన దనటం కంటే అర్థ - శాస్త్రీయ వర్గానికి చెందిన దనవచ్చును. మోహినియాట్టం సుందరమూ, సుకుమారమైన నృత్యం; ఇది మోహిని కథమీద ఆధారపడిఉంది. ఈ సమ్మోహావతి నిజానికి కృష్ణభగవానుని మారువేషమే. మోహినియాట్టంనృత్యాన్ని వేశ్యలుమాత్రమే చాలాకాలంగా ప్రదర్శిస్తూ వచ్చారు. తమిళనాడులో దేవదాసి ఆట్టం వేశ్యాలకు మాత్రమే ఎలా అంకితమై ఉండేదో ఈ నృత్యంకూడా అక్కడలాగే వీరికి అంకితమై వుంది. అయితేనేమి, ఈ రెండురీతుల నృత్యాలున్నూ, సుందర సుకుమార నృత్యాలనీ, వీనిలో ఏరూపంలోనూ అసభ్యత అనేది లేనేలేవనీ శాంతారావు, బాల సరస్వతివంటి గొప్ప నర్తకులు ఈ నృత్యాలను ప్రదర్శించినప్పుడే వాని పూర్వోన్నత్యము గోచరిస్తుందనీ మనం గుర్తుంచుకోవాలి. సర్వసాధారణంగా మోహినియాట్టంలో రామాయణ మహాభారత గాథలు పాడుతూ వానిని అభినయిస్తారు.

అప్పుడప్పుడు శృంగార రసకీర్తనలు వీటికి సాహిత్యంగా ఉండటం కద్దు. రామాయణ మహాభారతములనుండి ఒక భాగాన్ని పూర్తిగా మలయాళంలో ఆగకుండా పాడుతూ ఉంటే నర్తకి దానిని అభినయిస్తుంది. కథాకళిలోని అభినయంకంటే భరతనాట్యంలోని అభినయంకంటేనూ కూడ ఈ అభినయం ఎక్కువ సరళంగా ఉంటుంది. ఈ నృత్యంలో బోల్‌లు, సోల్‌కట్టులు చాలా వుంటాయి; వీనిని నర్తకి నృత్యంమాత్రం చేస్తుంది.

భారత దేశంలో అన్నిచోట్లా కనిపించే అతి వీర్య వంతమూ బలోపేతమైన నృత్యాలలో కొన్నిటికి మలబారు కూడా పేరు పొందింది. చాలా అసాధారణమైన నృత్యాలలో పులయన్ల నృత్యం ఒకటి. ఈ ప్రజలు పూర్వకాలంలో బానిసలుగా వుండేవారు; ప్రజాసంఘంలో వీరికి స్థానంలేదు; ఇప్పుడు వీరు ప్రజలందరితో కలిసిపోయినారు. పులయన్ పురుషులు పూనకం నృత్యాలు చేయటంలో ప్రత్యేకత గడించారు; పండుగ రోజులలో దేవాలయాలముందు వీరీ నృత్యాలు చేస్తారు. ఈ నృత్యం చేసేటప్పుడు ప్రత్యేకమైన ముక్కోణపు నల్లని పాగా పెట్టుకుంటారు; దీనిమీద పెద్ద పెద్ద చక్రాలు తెల్ల రంగుతో చిత్రిస్తారు. ఈ శిరోవేష్టనము ప్రాతకాలపు డాలు నమూనాలవలె వుంటుంది. పాదాలచుట్టు చీలమండలచుట్టు వీరు పెద్ద పెద్ద బోలు కడియాలు కట్టుకుంటారు. వీటిలో ప్రతిధ్వను లిచ్చే లోహంముక్క లుంటాయి. నర్తకులకు చిట్ట చివరకు పూనకం వచ్చి విపరీతంగా వణుక ఆరంభించినప్పుడు ఈ కడియాలనుండి ఒక విధమైన రోదన

ధ్వనిలాంటి ధ్వని పుట్టి గాలిని కీచుమనే ప్రతిధ్వనులతో నింపు తుంది. ప్రతి నర్తకుని వెంటనంటి ఇద్దరు పురుషు లుంటారు. నర్తకుడు పూనకం వచ్చి క్రింద పడిపోయేటప్పు డతణ్ణి వాళ్ళు పట్టుకొంటారు. నర్తకునికి వాళ్ళు తెలియని పూనకం వచ్చి, నృత్యం మానితే ఆ యిద్దరు అతణ్ణి సేద దీరుస్తారు. నర్తకునికి పూనకం ఆరంభ మయ్యేవరకు ఈ నృత్యాలు విస్తృత ఉత్సవాలలాగా వుంటాయి. ఆ తర్వాత చెవులు చిల్లులు పడేటట్లు డోళ్ళు మ్రోగుతూ వుండగా నర్తకులు ఆగి పిమ్మట మృగ గమనములను పోలిన అసంబద్ధ కంపన గతులతో నృత్యం చేస్తారు.

## ఏవేలకరడి నృత్యం :

కేరళ రాష్ట్రంలోని పాలఘాట్ జిల్లాలో అడవులలో ఇరుల అనే కొండజాతి తెగవారు నివసిస్తున్నారు. యుగ యుగాలుగా వీరి అభిమానాన్ని చూరగొన్న ఒకే ఒక ఇతివృత్తం వేటాడటం. మృగాలను- ప్రత్యేకంగా అడవి పందిని, మనుష్యుడు జయించట మనేది, వీరి నృత్యము లోని సహజమైన ప్రధాన ఇతివృత్తం. మత సాంఘిక సంబంధ మయిన అన్ని పండుగల సందర్భములలోనూ ఈ నృత్యం చేస్తారు. విజయవంతమయిన వేటలోని వివిధ దశలయందలి, పనులను, అభినయాన్ని ఈ నృత్యం ప్రదర్శిస్తుంది.

శివరాత్రి (ఫిబ్రవరి – మార్చి) కాలంలో, తమ పూర్వీకుల పూజా సందర్భంలో ఈ నృత్యం చేస్తారు. 'ఏ లేలా' పల్లవిపాడుతూ స్త్రీలు, పురుషులు గంటల తరబడి ఈ నృత్యం చేస్తారు:

## పులయార్ - కలినృత్యం :

ఇచటి ప్రజల వీరోచిత సంప్రదాయాలను సజీవంగా వుంచిన పురాతన కేరళ జానపద నృత్యాలలో ఇది యొకటి. లయకు, కళాభిరుచికి, శక్తిసంపదకు పేరుపొందిన ఈ నృత్యాన్ని ఎక్కువగా పురుషులే చేస్తారు; అప్పుడప్పుడు స్త్రీలుకూడా అందు పాల్గొనటం కద్దు.

దీనిపేరు సూచిస్తున్న రీతిగా, ఇది పైన ఉదహరించిన పులయాల (హరిజనుల)లో ప్రచారంలో ఉంది; వీళ్లే అసలు వ్యవసాయం చేసేవాళ్ళు. ఓనంవంటి పండుగల సందర్భాల లోనూ, ఇంకా ఇతరమైన మత, సాంఘిక సందర్భాలలోనూ కూడా ఈ నృత్యం సాధారణంగా చేయబడుతుంది. ఎక్కు వగా రామాయణ, మహాభారత పురాణములనుండి తీసు కొన్న ఇతివృత్తాలపై, ఈ నృత్యంలోని పాటలు ఆధారపడివుం టాయి. ఈ నృత్యంలో తప్పెటలవంటి వాద్యాలు వాయిస్తారు.

## మో ప్లా క ల్లి :

కేళరలోని జానపద గీతాలలో ఇది విలక్షణమైనది. దీనిలో మలబారు ముస్లిములు పాల్గొంటారు. కళావేశంతో నిండిన పూర్వకాలపు మోప్లాపాటలు ఈ నృత్యానికి వెనుక పాడుతుంటారు. ఈ పాటలలోని ప్రధాన ఇతివృత్తాలు రెండు: భక్తి,శృంగారములు ఈనృత్యం రెండు రీతులుగా ఉంటుంది. ఒకరీతి నృత్యంలో స్త్రీలు కూడా పాల్గొంటారు.

"మొప్లాహక్కాళి" లయకు, కళాభిరుచికి, శక్తిసంపన్న తకు పేరు పొందింది. దీనిలోని ప్రధానరీతి యేమంటే నర్త

కులు, చిన్న కర్రముక్కలు పట్టుకొని వాటిని కొడుతూ వలయాకారంగా తిరుగుతారు.

## వెలక్కలి:

కేరళ వీర సంప్రదాయాలను సజీవంగా నిలిపిఉంచిన నృత్యాలలో వెలక్కలి ఒకటి.

ఇప్పుడిది మహాభారత యుద్ధాన్ని ప్రదర్శించేదిగా వివరించబడుతున్నది. "పన్‌గుని" పండుగ (మార్చి, ఏప్రిలు) కాలంలో, వేర్వేరు వెలక్కలి బృందాలు, త్రివేంద్రంలోని సుప్రసిద్ధమైన పద్మనాభస్వామి ఆలయం ముందు ఈ నృత్యాన్ని ప్రదర్శిస్తారు.

ఈ నృత్యాన్ని పురుషులు మాత్రమే చేస్తారు. యుద్ధానికి ముందు, యుద్ధసన్నద్ధులు కావలసిందిగా హెచ్చరించటానికి చేసేరీతిగా డోళ్ళు, తప్పెటలు వాయిస్తారు. ఈ మోతతోపాటు నృత్య మారంభ మవుతుంది. దాని తర్వాత కత్తులను, డాలులను త్రిప్పుతూ లయాన్విత గతి పరంపర లారంభ మవుతాయి. ధర్మం ఏ పక్కన వుందో ఆ పక్షం యుద్ధంలో జయించి, ఓడిపోయిన పక్షం పారిపోయే దాకా, నృత్యంలో పాల్గొనేవారంతా యథావిధిగా నృత్యం చేస్తూనే వుంటారు. పురాతన వీరులు ధరించే దుస్తులను నర్తకులు ధరిస్తారు; నుదురుమీద, రొమ్మమీద, చేతులమీద సామానులు పెట్టుకొంటారు; కనులమీద నల్లటి కనుగ్రుడ్లు చిత్రించుకొంటారు.

## కోల్‌కలి మోపిల్లా పట్టు :

కేరళలోని చెరువులలోనూ ముస్లిము (మోప్లా)ల లోనూ విశేష ప్రచారంలో ఉన్న సాంఘిక్ నృత్యం కోల్కాలి. చిరుగంటలు బిగించిన కర్రముక్కలతో తాళం కొడుతూ, నర్తకులు సంక్లిష్టమైనరీతులలో ఏర్పడుతూ నృత్యం చేస్తారు. నృత్యాన్ని అనుసరించే పట్టు, లేక పాటలోని భాషలో ఎక్కువ యమకం ఉంటుంది; మలయాళంతో అరబిక్, ఉర్దు తమిళ పదాలు కలిసి ఉంటాయి.

పైన వర్ణించిన శక్తిపూర్ణమైన వీర నృత్యాలతో పాటు మలబారులో ఓనం పండుగ కాలంలో ప్రదర్శించే నృత్యాలున్నాయి. మలబారు సాంఘిక జీవితంలో ఇవి ముఖ్య నృత్యాలుగా ఉన్నాయి. ఓనం పండుగలో పడవల పందెం ముఖ్య లక్షణంగా కన్పిస్తుంది. పడవపందె మైపోయిన అనంతరం, కైకొట్టికవి అనబడే నృత్యాన్ని చేస్తారు. గ్రామం లోని యువతులు పూలతో ఒక వలయం నిర్మిస్తారు, దీనిని 'అట్టపూ' అంటారు. ఈ నృత్యానికి ఇది నాంది.

నర్తకులు, చిగుళ్ళు ఆకులు పుట్టటాన్ని సూచిస్తూ, అభినయంచేస్తూ వలయాకృతులుగా నృత్యం చేస్తారు, సుపరిచితమైన సంగీత లయల కనుగుణంగా చేతులు చరుస్తూ ఉంటారు. తమిళనాడు నృత్యాలలో మనం వర్ణించిన కోలాటం, కుమ్మి నృత్యాలను పోలివుంటుంది కయికొట్టుకవి నృత్యం. తర్వాత నర్తకులు మనోహరంగా కదులుతూ, చేతులూపుతూ, కుమ్మి, కోలాటం నృత్యాలలోని ప్రత్యేక రీతి ప్రాథమికా గమనాలను పోలిన గమన పరంపరలు

చేస్తారు. కేరళ ప్రాంతంలో కుమ్మి కోలాట నృత్యాలు కూడా చాలా ప్రచారంలో ఉన్నాయి.

మలబారులోని ప్రతి గ్రామానికీ ప్రతి కొండజాతి తెగకు దాని ప్రత్యేక జానపద నృత్యం ఒట్టంతుల్లల్ లేక కుమ్మి నృత్యంయొక్క తమ ప్రత్యేకరీతి ఉండనే ఉన్నది. ఇక రక రకాల వీరనృత్యాల సంగతి చెప్పనక్కరలేదు. వీనిలో కొన్ని పైన వర్ణించబడినవి. ఆయా ప్రాంతాలలో ఈ జానపద నృత్యాలు జరుగుతున్నప్పుడు చూస్తే నేతప్ప వాటి గొప్పతనం అవగతంకాదు.



63. పై చిత్రం ; యక్షగాన ప్రదర్శనంనుండి ఒక దృశ్యం: కర్ణాటక

64. క్రిందిచిత్రం : యక్షగానప్రదర్శనంలో విష్ణువు







65. చిత్రం : బొమ్మగుఱ్ఱం ఆట; తంజావూరు

## ౫. ఉపసంహారము

పై విషయాలు, భారతీయ జానపదనృత్యాల సమగ్ర వర్ణన కానేరదు. ప్రారంభములో మేము చెప్పినట్లు భారతీయ జానపదనృత్యాలు, ఈ దేశప్రజల జీవితాలలోని అమూల్యభాగంగా ఉన్నాయి. అందుచేతనే, ప్రతి ప్రాంతములోని జానపదనృత్యాలు, అచటి ప్రజల యుద్ధాలు మొదలు పెండ్లిండ్లు, ఆయా ఋతువులకు సంబంధించిన పండుగలు, మతవిషయాలవరకు, వారి దైనందిన కార్యకలాపాలలో నీళ్ళు తీసుకురావటం మొదలు ధాన్యం నూర్చటంవరకు; విత్తనాలు చల్లటం మొదలు చేలు కోయుటంవరకు వారి జీవితాలలో అంతర్భాగమైనవి. భారతీయ జానపద నృత్యాలలో ఇతివృత్తంలోనూ రీతిలోనూ మహత్తరమైన వైవిధ్యమున్నప్పటికినీ, అటు కాశ్మీరునుండి తిరువాన్కూరువరకు, ఇటు మణిపూరునుండి సౌరాష్ట్రవరకు గల జానపదనృత్యాలలో ఒకానొక విశిష్ట సంప్రదాయం అవిచ్ఛిన్నంగా పరిరక్షింపబడి వున్నట్లు, పై విషయాలవలన మనకు స్పష్టపడుతుంది. మహాభారతము, రామాయణము, భాగవత పురాణము, ఈ దేశపు శాస్త్రీయ సంగీతంపై నృత్యములపై తమ ప్రభావాన్ని చూపటమే కాకుండా, ఈ దేశపు జానపద నృత్యములకు, జానపద సంగీతానికి కూడా విషయాలైనవి. యక్షగానం, ఉత్తం తుల్లల్, జాత్ర, పావడాలు ఈ మహా

పురాణగాథలను ప్రదర్శిస్తున్నవి. రాస నృత్యాలకు కృష్ణ భగవానుని గాథ కేంద్రంగా ఉంది. గోపికలు భారతదేశ మంతటా, ప్రత్యేకంగా మణిపూర్, రాజస్థాన్, సౌరాష్ట్ర, ఉత్తరప్రదేశ్‌లలో ఉన్నారు. ఈ మత పురాణగాధలకు కూడా సంబంధించివున్న భక్తి నృత్యాలు, భారతదేశంలోని వివిధప్రాంతాల శాస్త్రీయ నృత్యాలలో భాగంగా ఉన్నట్లే ఈ దేశంలోని జానపద నృత్యాలలో కూడా భాగంగా ఉన్నాయి.

చేలు కోయటం, నూర్చటం అనేవిషయాలు కేంద్రం గాగల జానపద నృత్యాలు, భారతదేశంలోని అన్ని ప్రాంతా లలోనూ ఉండనే ఉన్నాయి. అంతేకాక, బీహార్, మధ్య భారత్, ఒరిస్సా, బెంగాల్, రాజస్థాన్, మహారాష్ట్ర ప్రాం తాలలో ఈ నృత్యాలలోని గమన రీతిలో ఒకవిధమైన పోలిక కలదు కూడ. అన్ని రాష్ట్రాలలోనూ మనం చెప్పు కొన్న కొండజాతి నృత్యాలు, భారతదేశంలో ఇంచుమించు అన్ని అనాదిజాతుల వారిలోనూ కన్పిస్తాయి. ఈ విధంగా భిల్లులు, మారియాలు, హోలు, ఒరియనులు, సంతాలులు మొదలైన వారిలోకూడ ఒకరి నృత్యాలకూ మరొకరి నృత్యాలకూ పోలికలున్నాయి.

గర్బా నృత్యం, కుమ్మీ, కోలాటం, రాజస్థాన్‌లోని ఘుమార్ వంటి సాంఘిక నృత్యాలు ప్రత్యేక వర్గంగా పేర్కొన వచ్చును. మరల వీని అన్నిటిలో కూడా పోలిక కన్పిస్తుంది. ఎక్కడయితే నిస్సందేహంగా వైవిధ్యం ఉండి; ఐక్యము కూడా ఉంటుందో అక్కడ జీవిత పరిపూర్ణత వుంటుందనే

సత్యాన్ని, ఈ దేశపు జానపద నృత్యాలు మనకు అవగతం చేస్తున్నాయి. నేటి భారతదేశంలోని ప్రజాజీవితంలోనూ, కళలలోనూ వున్న వైవిధ్యం, ఐక్యభావము - ఈ దేశంలోని వివిధరాష్ట్రాల, ప్రాంతాల జానపదనృత్యాల దృశ్యాలను, ఒకే దృశ్యంగా చూడగలిగినప్పుడు గోచరించినంత పరిపూర్ణంగా మరొకచోట గోచరం కాదు. తరచు భారతదేశాన్ని గురించి చెప్పబడే, ఐక్య వైవిధ్యములు చాలవరకు విద్వాంసులు కృత్రిమంగా చెప్పేమాటలే. అయితే, ప్రజల సజీవ సంప్రదాయంగా వున్న ఈ వైవిధ్యం, ఈ ఐక్యభావము ఈ విశాలదేశపు జానపద నృత్యాలలోనూ జానపద సంగీతం లోనూ సమగ్రంగా అనుభూతమవుతున్నవి. (మనోహరంగా దర్శనమిస్తున్నవి; ప్రత్యక్షమవుతున్నవి.)

## కృతజ్ఞతలు :

ఈ పుస్తకంలోని ఫోటోగ్రాఫులు - రచయితలు స్వయంగా తీసినవి మినహాయిస్తే, తక్కినవి - ఇండియా ప్రభుత్వం యొక్క ప్రెస్ ఇన్‌ఫర్‌మేషన్ బ్యూరో వారి సౌజన్యం ద్వారానూ, వివిధ రాష్ట్రప్రభుత్వాల సమాచార, ప్రచారశాఖల సౌజన్యంద్వారానూ సంపాదించబడినవి. ఇందుకు వారందరికీ రచయితలు ఋణపడి ఉన్నారు. ...

## ఫొటోగ్రాఫుల జాబితా:

1. వెదురు నృత్యం; లూషై కొండలు
2. బుగురుంబ నృత్యం; బోడోజాతి, కచార్ కొండలు
3. ఘోరోల శక్తి నృత్యం
4. సేమనాగుల యుద్ధనృత్యం
5. మణిపూర్ నాగజాతి నృత్యం
6. మోనాగజాతి వారి మోవోపివోనఘు నృత్యం; మణిపూర్
7. నెఫా ప్రాంతంలోని ఒక నాగజాతి స్త్రీ నృత్యం
8. వేటనృత్యం; అంగామినాగులు
9. నెఫా ప్రాంతంలోనిఒక నర్తక బృందం
10. మణిపూర్‌లోని పుంగ్‌చోలం నృత్యం
11. థబాల్ చోంగ్‌బి నృత్యం; మణిపూర్
12. రాస నృత్యం; మణిపూర్
13. నాగా నృత్యం; మణిపూర్
14. రఘుం నృత్యం; అబోర్ కొండలు
15. సిక్కిం లామాల వాద్య సమ్మేళనము
16. లామాల ముసుగు నృత్యం; డార్జిలింగ్
17. లెప్చాల యుద్ధ నృత్యం
18. లెప్చా నృత్యం; డార్జిలింగ్
19. ఖడ్గనృత్యం; కులు, హిమాచల్ ప్రదేశ్
20. గద్దీనృత్యం; హిమాచల్ ప్రదేశ్

21. పంగీ నృత్యం; హిమాచల్ ప్రదేశ్
22. బూరా నృత్యం; హిమాచల్ ప్రదేశ్
23. కజ్రీ నృత్యం; కాశ్మీర్
24. డోగ్రా నృత్యం; జమ్మూ, కాశ్మీర్
25. థోరా నృత్యం; జౌన్సార్, ఉత్తర ప్రదేశ్
26. బరదినటినృత్యం; జౌన్సార్ బవర్, ఉత్తరప్రదేశ్
27. థాలీనృత్యం; గార్వాల్, ఉత్తరప్రదేశ్
28 వసంత నృత్యం; కుమాన్ కొండలు, ఉత్తరప్రదేశ్
29. గడ్డికోత నృత్యం; కుమాన్ కొండలు, ఉత్తరప్రదేశ్
30. భిల్ నృత్యం; హామీర్ పూర్, ఉత్తరప్రదేశ్
31. జదుర్ నృత్యం; భూమిజాజాతి, ఒరిస్సా
32. ఛౌ నృత్యం; ఒరిస్సా
33. ముసుగుభౌ నృత్యం; సరైకేలా, బీహార్
34 ఓరాన్ నృత్యం; బీహార్
35. ఓరాన్ వాద్య సమ్మేళనము
36. ఛోటానాగపూర్ ఆదిమవాసుల నృత్యం; బీహార్
37 బీహార్ ఛౌ నర్తక బృందం
38. సంతాల్ నృత్యన; పశ్చిమబెంగాల్
39. సంతాల్ నృత్యం; పశ్చిమబెంగాల్
40. గజన్ నృత్యం; పశ్చిమబెంగాల్
41. ఛౌల్ నృత్యం; పశ్చిమబెంగాల్
42. మారియా నర్తకులు; బస్తర్, మధ్యప్రదేశ్
43. మారియా నర్తకులు; బసర్, మధ్యప్రదేశ్

44. మారియా నర్తకుల వాద్య సమ్మేళనము; బస్తర్, మధ్యప్రదేశ్
45. గోండుల కర్మా నృత్యం; మధ్యప్రదేశ్
46. భిల్ నృత్యం; రాజస్థాన్
47. ఝుమార్ నృత్యం; రాజస్థాన్
48. దాండియారాస; రాజస్థాన్
49. కబీఘోడీ నృత్యం; రాజస్థాన్
50. భాంగ్రా నృత్యం; పంజాబ్
51. దాండియా రాస; సౌరాష్ట్ర
52. దాండియా రాస; ద్వితీయరీతి, సౌరాష్ట్ర
53. దాండియా రాస; తృతీయరీతి, సౌరాష్ట్ర
54. తిప్పని నృత్యం; సౌరాష్ట్ర
55. గర్బానృత్యం; గుజరాత్
56. గర్బానృత్యం; గుజరాత్
57. పంటకోతల నృత్యం; గోవా
58. పవడాగానం; మహారాష్ట్ర
59. కోలీజాలరుల నృత్యం; బొంబాయి
60. కోలీజాలరులనృత్యం; బొంబాయి
61. లంబాడీస్త్రీల నృత్యం; హైదరాబాదు
62. సిద్దీల ఖడ్గనృత్యం; హైదరాబాదు
63. యక్షగానప్రదర్శనంనుండి ఒక దృశ్యం; కర్ణాటక
64. యక్షగాన ప్రదర్శనంలో విష్ణువు
65. బొమ్మ గుర్రం ఆట; తంజావూరు